అక్టోబరు 2019




తెలుగు పిల్లల ఈ మాసపత్రిక వెల రూ.30/-

150 సంవత్సరాల గాంధీ!




సంపుటి: 5 సంచిక: 4 పుటలు: 68 విడి ప్రతి వెల: 30 రూ. అక్టోబరు 2019



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670, 9490180695

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:**

జి.వి. నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి **యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753 రాధా స్కూల్ (అనంతపురం) లో చదివే పిల్లలు

**వాణిజ్యం, మార్కెటింగు:**

బి. అశోక్: 9963571510




## విషయ సూచిక





ముఖచిత్రం: 150 ఏళ్ళ గాంధీ!
చిత్రకారుడు: వీరాంజనేయులు

కొత్తపల్లి 106 వ పుస్తకం!




---

వనే రణే శత్రు జలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వత మస్తకే వా ।
సుప్తం ప్రమత్తం విషమ స్థితం వా
రక్షంతి పుణ్యాని పురాకృతాని ॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

కాననమున, రణమున, సలి
లానల రిపు మధ్యమున, మహా
బ్ధినగాగ్ర స్థానమున, సత్తు- నిద్రితు-
బూనికతో బూర్వ పుణ్యములు రక్షించున్॥

భావం: అడవిలో గాని, యుద్ధంలోగాని, నీళ్ళ మధ్యలో గాని, మంటలు క్రమ్ముకున్నప్పుడు వాటి మధ్యలో గాని, మహా సముద్రంలో గాని, పర్వత శిఖరాలమీదనే గాని, నిద్రపోతున్నా గాని, మెలకువతో ఉన్నా గాని, ప్రమాదకరమైన స్థితుల్లో ఉన్నా కూడా, గతంలో చేసిన మంచిపనులు మనల్ని కాపాడతాయి.

# 150 ఏళ్ల గాంధీ



మనందరికీ 'జాతిపిత ' గా పరిచితుడైన 'మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ' 1869 అక్టోబరు రెండవ తేదీన- గుజరాత్ రాష్ట్రంలోని పోర్‌బందర్‌లో పుట్టాడు- అంటే ఈ అక్టోబరు రెండుకు సరిగ్గా 150 ఏళ్ల క్రితం. వాళ్ళ నాన్న కరంచంద్ గారు అక్కడి రాజావారి సంస్థానంలో దివాన్‌గా పనిచేసేవారు . చిన్నప్పుడు అన్ని విషయాల్లోనూ మధ్యరకంగా ఉండిన గాంధీ, పెద్దవుతూన్న క్రమంలో లండన్‌కి పోయాడు; అక్కడ న్యాయశాస్త్రం చదివి 'బారిస్టరు' పట్టా పుచ్చుకున్నాడు. ఆ తర్వాత దక్షిణాఫ్రికా దేశానికి వెళ్ళి అక్కడ లాయరుగా ప్రాక్టీసు చేసాడు.

తనలాగే అక్కడికి వలస వెళ్లిన భారతీయులకు చాలామందికి ఆ రోజుల్లో అక్కడ ఓటు హక్కు గాని, ఇతర హక్కులు గానీ ఉండేవి కాదు. గాంధీ వారి తరపున పోరాటం నడిపించి, అక్కడి ప్రభుత్వం దిగి వచ్చేలా చేశాడు.. అక్కడి భారతీయులకు హక్కులు వచ్చాయి. అట్లా 'మంచి నాయకుడు'గా ఎలా ఉండాలో నేర్చుకొని మన దేశానికి వచ్చిన గాంధీ, అటుపైన స్వాతంత్రోద్యమంలో చురుకుగా పాల్గొని, అనేక మందికి స్ఫూర్తినిచ్చాడు. మన జాతీయో–ద్యమానికే దిశానిర్దేశం చేయగల్గినంత పెద్దరికం సంతరించుకున్నాడు.; 'మహాత్ముడు' అనిపించుకున్నాడు.

1947 లో బ్రిటీష్ వాళ్ళు మన దేశాన్ని విడిచి పెట్టి పోయే నాటికి గాంధీ కాస్తా 'గాంధీ తాత' అయిపోయాడు. జనాలు, నాయకులు, ఆయనకు ఒకవైపున 'జాతి పిత' అని బిరుదులు

తగిలిస్తూనే, మరొకవైపున ఆయన చెప్పిన అనేక విషయాల్ని ప్రక్కన పెట్టేసి, తమకు నచ్చినట్లు చేసారు. వాళ్ళ తీరుకు ఇప్పటి మన తీరుకు ఏమంత పెద్ద భేదం లేదు చూడండి..



ఒక రాజకీయ నాయకుడిగా గాంధీ చెప్పిన సంగతులు, మాట్లాడిన విషయాల విస్తృతి చూస్తే ఆశ్చర్యం వేస్తుంది . వ్యక్తిగత జీవితం నుండి పరిపాలనా వ్యవహారాల వరకూ గాంధీ తన అభిప్రాయాలు చెప్పని అంశమే కనబడదు. ఇలా తన అభిప్రాయాలను వెలువరిం–చటం కోసం ఆయన 'యంగ్ ఇండియా', 'హరిజన్' అనే రెండు పత్రికలు నడిపాడు. ఎప్పుడు మాట్లాడినా, ఏది రాసినా, 'అందరం సత్యవంతులంగా ఉండాలి' అని మటుకు చెప్పకుండా ఉండలేకపోయేవాడు గాంధీ. 'దైనందిన వ్యవహారాలతో సహా అంతటా నిజం చెప్పటం , నిజాయితీగా ఉండటం, సత్యానికి పెద్ద పీట వేయటం, అంతరంగాన్ని తరచి చూసుకోవటం చాలా అవసరం' అని పదే పదే చెప్పాడు . తన జీవితంలో సత్యాన్ని అమలు చేసేందుకు గట్టి ప్రయత్నమే చేశాడు. నిజం కోసం నిలబడి, అన్నేసి కష్టాలనూ ఎదుర్కున్న హరిశ్చంద్రుడి కథని గాంధీ ఎప్పుడూ గుర్తుచేసుకునేవాడు.

గాంధీ నొక్కి చెప్పిన మరొక సంగతి 'అహింస'. 'దుర్మార్గాన్ని, అన్యాయాన్ని సహించకూడదు; అడ్డుకోవాలి. అయితే అప్పుడు కూడా మన మనసులో మటుకు కోపానికి , వైరానికి తావు ఇవ్వకూడదు. మన లోపల శాంతిని నిలుపుకుంటూ, స్థిర చిత్తంతో చెడును నిలువరించేం–దుకు ప్రయత్నిస్తూ పోవాలి. తుపాకీతో చేసే యుద్ధంకంటే, సత్యం, శాంతి పునాదులుగా చేపట్టే ఇలాంటి నిరసన బలమైనది' అని గాంధీ నమ్మటమే కాక , దాన్ని ఆచరణలో పెట్టి చూపాడు.

'సమాజంలో అందరం కలిసి ఉండాలి . కలిసి పని చేసుకోవాలి . పనిలో ఎక్కువ తక్కువలు లేవు. బుద్ధి పరంగా జీవించటం, శరీర శ్రమ చేయటం కంటే ఎక్కువ కాదు- నిజానికి శరీర శ్రమే గొప్పది ' అన్న గాంధీ చేతి పనులకు, వికేంద్రీకరణకు ప్రాతినిధ్యం వహించాడు. 'అధి–కారం కొందరి చేతుల్లో ఉండకూడదు, పరిశ్రమల్లో కార్మికుల యాజమాన్యాలుండాలి. కులాల పేరిట, మతాల పేరిట కొట్లాటలు, అంతరానితనం వంటి దురాచారాలు ఉండకూడదు . నాయకులు, యజమాన్యాలు ప్రజల ఆస్తులకు ధర్మకర్తలుగా , బాధ్యతగా ఉండాలి తప్పిస్తే , వాటికి సొంతదారులలాగా నిరంకుశంగా వ్యవహరించకూడదు ' లాంటి అనేక అంశాలను గాంధీ తన రచనల్లోను, మాటల్లోనూ ప్రస్తావించటమేకాక, జీవితంలో ఆచరించే ప్రయత్నం చేసాడు.



గాంధీ 150 ఏళ్ల జయంతి సందర్భంలో ఆయనను 'ఒక వ్యక్తిగా' బేరీజు వేయటం కంటే, 'లెక్కలేనన్ని గొప్ప ఆలోచనల్ని వెలువరించిన ఒక తాత్విక శక్తిగా చూడటం' మనందరికీ మేలు అనిపిస్తుంది. ఆయన చెప్పిన విషయాల్లో మంచిని గ్రహించి, దానిని మన నిత్యజీవితాల్లో ఎంత వరకూ అమలు చేయగలమో చూడటం - ఇది మనం చేయాల్సిన పని. 150 ఏళ్ల గాంధీకి ఇవాల్టి రోజున మనం ఇవ్వగలిగే నివాళి కూడా అదే.

ఆదర్శవంతంగా జీవించే గొప్పవాళ్లందరికీ నమస్కారాలతో,

కొత్తపల్లి బృందం.



# లైబ్రరీ ఉండాలి!

బిట్టు కథలు

*జరిగిన కథ : బిట్టు ఢిల్లీ పిల్లవాడు. సెలవల్లో వాళ్ళ అమ్మమ్మ వాళ్ల ఊరుకు వచ్చాడు. ఎన్నో విషయాలు నేర్చుకొని, నేర్పి, ఇప్పుడు ఇక ఢిల్లీకి తిరిగి వెళ్తున్నాడు...*

బిట్టు వాళ్ళ అమ్మ సునంద హడావిడి పడు–తూ వచ్చింది ఢిల్లీ నుండి.

వస్తూనే, కొంచెం బుగ్గలొచ్చి సంతోషంగా కనిపిస్తున్న కొడుకుని చూసుకుని, మురిసి–పోయింది. వాడిని అమ్మమ్మ -తాతయ్యల దగ్గరకి పంపి మంచి పని చేసానని తృప్తి పడింది. ఆ ఒక్క నెలలోనే బిట్టు ఎంతో పెద్దవాడు అయిపోయినట్టు అనిపించాడు తనకు.

అమ్మ చెయ్యి పట్టుకుని ఇల్లంతా చూపించి , రెయిన్బో గాడిని అమ్మకు పరిచయం చేసా –డు బిట్టు.

తాతమ్మ గది వరండాలో ఉన్న పిచ్చుకల గూడును చూపించాడు. "చూసావా, అమ్మ

పిచ్చుక? పిల్లలకు ఆహారం తెచ్చి తినిపి – స్తోంది!" అన్నాడు.

తాతమ్మ దగ్గరకి తీసుకెళ్తూ రహస్యంగా నోటికి చెయ్యి అడ్డం పెట్టుకొని చెప్పాడు : 'తాతమ్మతో కొంచెం గట్టిగా మాట్లాడు , పాపం, వినిపించదు' అంటూ.



"ఏమిట్రా నామీద రహస్యాలు చెబుతున్నావ్ మీ అమ్మకు ?!" అంది తాతమ్మ నోరంతా తెరిచి నవ్వుతూ. "సునీ, నీ కొడుకు సందడి అంతా ఇంతా కాదే , బోలెడు స్నేహితుల్ని పోగేసేడు. వాడు వెళ్లిపోతే మాకు ఎవ్వరికీ తోచనే తోచదు" అంది అమ్మతో.

కొడుకు హిందీ యాస వదిలేసి తెలుగును స్పష్టంగా మాట్లాడటం , అంతకు ముందు వాడని తెలుగు పదాల్ని చాలా వాటిని వాడటం గమనించింది సునంద.

రమ్య, రాహుల్, చిట్టి, దావీదు అందరూ వచ్చేసారు సునందని చూసేందుకు . ఏడేళ్ల రమ్య సునందని చుట్టేసుకుంది ఎప్పటి – నుండో తెలిసున్న దానిలా. ఢిల్లీ ఆంటీ తనకి చాలా నచ్చేసింది చూడగానే . ఉదయాన్నే దువ్వెనలు, నూనె పట్టుకొని వచ్చి కూ – ర్చున్నది- "ఆంటీ! నాకు జడలు నువ్వే వెయ్యాలి, . అమ్మమ్మకి జడలు వెయ్యటం సరిగ్గా రాదు" అంటూ.

"ఓసి భడవా కానా ! నిన్నటివరకూ 'నువ్వే జడలు బాగా వేస్తావు అమ్మమ్మా !' అని నా దగ్గర వేయించుకునేదానివి, ఇవాళ్ల ఆంటీ పార్టీలో చేరావు" అంది అమ్మమ్మ నవ్వుతూ.

"అంటే నువ్వు కూడా బాగానే వేస్తావు ; కానీ నీకంటే ఆంటీ ఇంకా చక్కగా వేస్తుంది " అని

సర్ది చెబుతున్నట్లు అంది రమ్య.

సునంద కూడా నవ్వి, "సరేలే! నేను ఉన్నన్ని రోజులు నేనే వేస్తాను " అంటూ మాట ఇచ్చేసింది.




ఆరోజున సునంద పిల్లలందరినీ పిల్చింది. తను తెచ్చిన బహుమతులు తీసి, పేరుపేరు–నా ఇచ్చింది. చిట్టికి, రమ్యకి గౌన్లు, చెవులకి రకరకాల రింగులు, గొలుసులు తెచ్చింది. దావీదు, రాహుల్, బిట్టులకేమో టీ షర్టులు, చేతికి వాచీలు తెచ్చింది. రాహుల్ సం–తోషంగా తీసుకున్నాడు, కానీ కాస్త పెద్ద వాడైన దావీదు ఇవన్నీ తీసుకుందుకు మొహమాటపడ్డాడు.

ఆ తర్వాతి రోజున ఇద్దరు అమ్మమ్మలు , కమలమ్మ అంతా కలిసి పిల్లల కోసం తిను బండారాలు చేసే హడావుడిలో ఉన్నారు . 'మనందరం ఊరంతా తిరిగి, రెస్టారెంట్ లో భోజనం చేసి, సినిమా చూసి వద్దాం పదండి' అంటూ పిల్లల్ని తీసుకుని క్యాబ్ లో బయలుదేరింది సునంద.

అందరూ కలిసి ఊరంతా బాగా తిరిగారు ఆ రోజున. కనకదుర్గమ్మ గుడి దగ్గర క్రొత్తగా కడుతున్న ఫ్లై ఓవర్ పనులు చూసారు ; వి–శాలమైన బి.ఆర్.టి.ఎస్. రోడ్డు చూసారు; క్రొత్తగా తయారవుతున్న గురునానక్ నగర్ కాలనీ అంతా తిరిగి, చివరికి కాళ్ళు నొప్పులు పుట్టే సమయానికి అక్కడే ఒక మంచి హోటల్‌లో భోజనం చేసారు . ఆ తర్వాత మల్టిప్లెక్స్‌లో నడుస్తున్న ఆమీర్ ఖాన్ సినిమా 'దంగల్' చూసేందుకు వెళ్లారు అందరూ . పిల్లలందరికీ కుస్తీ పోటీలు తెగ నచ్చేసాయి.

సాయంత్రం ఇల్లు చేరేసరికి పిల్లలు బాగా అలిసిపోయి ఉన్నారు. "ఇంక రెండు రోజుల్లో

బిట్టు వెళ్ళిపోతున్నాడు; అట్లాగే రమ్య, రాహుల్ కూడా వాళ్ల ఊరు వెళ్లిపోతున్నారు " అని అందర్నీ ఇక్కడే ఉంచేసింది సునంద . రాత్రి భోజనాలు అయ్యాక అందరూ డాబా మీదకి చేరారు.

పిల్లలు 'దంగల్' సినిమా గురించి మాట్లాడుకుంటున్నారు. బిట్టు అన్నాడు 'తాతయ్యా, గీత, బబిత ఇద్దరూ గెలవాలని ఎంత కష్టపడ్డారో తెలుసా , నువ్వు తప్పకుండా చూడాలి ఆ సినిమా' అన్నాడు.

'అవునురా బిట్టూ! మనం సాధించాలనుకున్నది సాధించేవరకు వదల కూడదు 'ఒక పాఠంలా చెప్పారు తాతయ్య.

తను అనుకున్నది గుర్తొచ్చిన దావీదు గుప్పెళ్లు బిగుసుకున్నాయి . తాతయ్యకు వాడి ఆలోచనలు అర్థం అయినై . ఆయన నవ్వి, వాణ్ణి దగ్గరగా కూర్చోబెట్టుకున్నారు.

ఇంతలో రమ్య , చిట్టి ఇద్దరూ క్రిందకి వెళ్లి , మళ్లీ వచ్చారు.

"ఏమైందర్రా?!" అంది మణి . "తాతమ్మకి మెలకువ వచ్చి, మనకోసం వెతుక్కుంటోందేమో అని, చూసి వచ్చాం అమ్మమ్మా!' చెప్పారు వాళ్ళు.



సునంద ఆశ్చర్య పోయింది. "పల్లెల్లో పిల్లలకి ఇంత చిన్న వయసు నుంచే తోటి మనిషి గురించి ఎంత శ్రద్ధ!" అనుకుంది.

బిట్టు అమ్మమ్మ ఒడిలో తల పెట్టుకుని పడుకున్నాడు. వాడు ఏదో చేతులు , వేళ్లు మడిచి లెక్కలు వేయటం చూసి తాతయ్య అడిగారు- 'ఏమి లెక్కలు వేస్తున్నావురా , బిట్టూ?!' అని.

'నేను మళ్లీ పోరంకి వచ్చేందుకు ఇంకా ఎన్ని రోజులు ఉందో లెక్కవేస్తున్నాను తాతయ్యా' అన్నాడు వాడు.

వాడి మనసు అర్థమై, అమ్మమ్మ, తాతయ్యల మనసులు తడి అయ్యాయి . సునందకి కూడా ఒక్క క్షణం బాధ అనిపించింది. "కానీ తప్పదు, మనసును గట్టి చేసుకోవాలి " అనుకున్నది. వాడి దృష్టిని మరలించేందుకు అడిగింది- 'బిట్టూ, నీకు అమ్మమ్మ ఊళ్లో బాగా నచ్చిన విషయాలు, అసలు నచ్చని విషయాలు చెప్పు' అంది. బిట్టు టక్కున లేచి కూర్చున్నాడు--

'నీకు తెలుసా, ఈ ఊళ్లో పిల్లలకోసం ఒక్క లైబ్రరీ కూడా లేదమ్మా! మన దిల్లీలో లాగా పిల్లల కోసం లైబ్రరీలు అసలు లేనే లేవు. ఇంక పిల్లలు చదువుకోవాలంటే ఎలా? తాతయ్యతో కలిసి నేను ఈ ఊళ్ళో లైబ్రరీకి వెళ్లాను - అక్కడ నేను చదువుకునే పుస్తకాలు ఏమీ లేవు. పెద్దవాళ్లకి కూడా కొంచెం పుస్తకాలే ఉన్నాయి' అన్నాడు- "'కొన్ని' పుస్తకాలే ఉన్నాయి" సరిచేసారు తాతయ్య. "అవును 'కొన్ని' పుస్తకాలే ఉన్నాయి" దిద్దుకున్నాడు బిట్టు.

తాతయ్య మనవడి నోటినుంచి క్రొత్త విష – యం వింటున్నారు . దాని ప్రాముఖ్యత గమనించో ఏమో , కొంచెం నిశ్శబ్దం అయ్యారు.



రాహుల్, దావీదు, చిట్టి, రమ్య మటుకు వెంటనే అడిగారు: "ఏమిటి?! దిల్లీలో పిల్లల కోసం ప్రత్యేకం లైబ్రరీలు ఉన్నాయా?!' అని. వాళ్ళు అడగటంలోనే బయటపడింది , ఆ ఊహ వాళ్లకి ఎంత ఆశ్చర్యాన్నిచ్చిందో.

'బోలెడు ఉన్నాయి! పోయిన సారి నా పు–

ట్టినరోజుకి అమ్మ ఏం చేసిందో తెలుసా? మా యింటికి దగ్గర్లో ఉన్న పిల్లల లైబ్రరీలో నాకోసం మెంబర్షిప్ తీసుకుని, ఆ లైబ్రరీ కార్డ్ ఇచ్చింది! ఇంక అప్పటినుండి నేను దానితో బోలెడు పుస్తకాలు ఇంటికి తెచ్చుకుని చదువుకుంటున్నాను. పుస్తకాలు చదివి, వెనక్కి ఇచ్చేస్తే, మళ్ళీ వేరే పుస్తకాలు తెచ్చు–కోవచ్చు!' అన్నాడు బిట్టు, దాన్ని గుర్తు చేసుకుంటూ సంతోషంగా .

పిల్లలంతా అసూయ పడుతున్నట్లు చూసా–రు వాడివైపు.

'ఢిల్లీలో కాటర్ పిల్లర్, టాయ్ ట్రెజర్, ట్రెజర్ హంట్ అనే లైబ్రరీలున్నాయి. ఇంకా 'చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్' వాళ్ల ఆఫీసు ఉంది కదా, అక్కడైతే పిల్లల 'రీడింగ్ రూమ్' ఉంది. అందులో కూర్చొని ఏ పుస్తకమైనా చదువుకోవచ్చు!' ఊరిస్తూ చెప్పాడు బిట్టు.

"ఏ పుస్తకమైనా చదవచ్చా?!" ఆశ్చర్యపో–యారు పిల్లలు.

"పుస్తకాలే కాదు- మంచి మంచి బొమ్మలు కూడా అద్దెకు ఇస్తారు తెలుసా, లైబ్రరీల్లో?!" అని బిట్టు అంటే పిల్లలంతా ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు. అట్లాంటి లైబ్రరీల్ని తలచుకొని, వాటిలో తాము స్వయంగా కూర్చొని చదువుతున్నట్లు, ఆడుతున్నట్లు ఊహించుకున్నారు. ఆ ఊహ ఎంత అద్భుతంగా అనిపించిందో వాళ్ల నిశ్శబ్దమే తెలియజేసింది.

'తాతగారూ, మన ఊళ్లో కూడా పిల్లల కోసం ఒక లైబ్రరీ పెట్టుకుందామండీ!' అన్నాడు దావీదు ఒక క్షణం ఆగి.

బిట్టు, దావీదుల మాటల వల్ల తాతయ్య మనసులో క్రొత్త ఆలోచన మొదలైంది : 'ఇన్నాళ్లూ తనకు ఇది తోచలేదు . పిల్లల అవసరాలని వాళ్లే తెలుసుకుని చెబుతున్నారు చూడు!' అని.

'పొరంకికి దగ్గరలోనే విజయవాడలో 'సర్వో–త్తమ లైబ్రరీ' ఉంది. ముప్ఫై ఏళ్ళుగా ఏ ఒక్క

రోజూ సెలవు తీసుకోకుండా ప్రజలందరి కో – సమూ తెరిచి ఉంటోంది అది. పిల్లలకోసమని అందులో ఒక బుక్ క్లబ్‌ని కూడా తెరిచారు క్రొత్తగా. కానీ తను పిల్లల్ని అక్కడికి తీసుకె – ళ్లనే లేదు..! రేపు వీలైతే పిల్లల్ని అక్కడికి తీ – సుకెళ్ళాలి తప్పకుండా" అనుకున్నారాయన.



'దావీదు, చిట్టిలనైతే ఇకపైన కనీసం నెలకు ఒక్కసారన్నా అక్కడికి తీసుకెళ్తాను . వీలై– నంత త్వరలో ఇక్కడ కూడా పిల్లల లైబ్రరీ ఒకటి ఏర్పాటు చేయిస్తాను !" అని నిర్ణ – యించుకున్నారు.

"బిట్టూ! నువ్వు ఈసారి వచ్చేసరికి ఇక్కడ ఒక పిల్లల లైబ్రరీ ఉంటుంది. నేను మాట ఇస్తున్నాను!" అన్నారు ధృడంగా.

"నాన్నగారూ, దానికి కావలసిన ఏర్పాట్లు చే– యమని మీరు పంచాయితీ వాళ్లని అడ – గండి. వారికి సాధ్యం కాకపోతే, మన ఇం– ట్లోనే ఒక రెండు గదుల్లో లైబ్రరీని ఏర్పాటు చేద్దాం. పుస్తకాలు, ర్యాకులు నేను తెప్పిస్తా – ను. బిట్టు చెప్పింది నిజమే. పిల్లలు చదువు– కునేందుకు సదుపాయం లేకపోతే ఎలా ? అన్నీ మా రాజధాని వాళ్ల కోసమేనా?!" అంది సునంద.

రమ్య వచ్చి గారంగా సునంద ఒళ్లో కూ – ర్చుంది. చిట్టి, రమ్య ఇద్దరిదీ ఒకే వయసు.. అయినా చిట్టి ఆ పసితనాన్ని దాటి, ఒక పె– ద్దరికంతో హుందాగా ప్రవర్తించటం తలచు – కొని ముచ్చటేసింది సునందకి.

అయినా "చిట్టి తన బాల్యాన్ని పూర్తిగా అనుభ వించగలుగుతోందా?!" అని విచార– పడింది. అంతలో ఏదో ఆలోచన వచ్చినట్టు, చిట్టిని దగ్గరకు పిలిచి "చిట్టీ, నువ్వు కూడా

మాతో దిల్లీ వచ్చి చదువుకోరాదూ, మేం తీ-సుకెళ్తాం?!" అని అడిగింది. ఒక్క క్షణం ఆలోచించింది చిట్టి.



'మరి అమ్మమ్మ, తాతయ్యలకి ఎవరు తో-డుంటారు? అమ్మమ్మకి చిన్న చిన్న పనులలో నేను సాయం చేస్తాను కదా , నేను దిల్లీ వస్తే ఎలా?!' అంది.

సునంద గుండె బరువెక్కింది. 'ఇంత చిన్న పిల్లలకి ఇవన్నీ ఎట్లా తెలుస్తాయి? ఇంత బా-ధ్యతగా ఎలా ఆలోచించగలరు ?' అని ఆశ్చర్యపోయింది.

"సరే, అయితే ముందు కొన్నేళ్ళు నువ్వు బాగా చదువుకో. ఆ తర్వాత దిల్లీ వద్దువు-గాని. అప్పుడు అమ్మమ్మ , తాతయ్యలని కూడా తీసుకొద్దువు- సరేనా?!' అంది.

ఆకాశంలో చంద్రుడు పిల్లల కబుర్లు వినేం -దుకా అన్నట్టు భూమికి ఇంకా దగ్గరగా జరి-గాడు. దాంతో ఇప్పుడు మరింత పెద్దగా కనిపిస్తున్నాడు. బిట్టు ప్రక్కనే ముడుచుకుని పడుకున్న రెయిన్బో గాడు చటుక్కున లేచి చిన్నగా 'భౌ' అన్నాడు. అమ్మమ్మ నవ్వి 'అదిగోనర్రా! వాడిని ఎవరూ పట్టించుకోటం లేదని, రెయిన్బో గాడు కూడా మాట్లాడు -తున్నాడు!' అంది. అందరూ నవ్వారు.

బిట్టు చటుక్కున లేచి డాబా మెట్ల వైపుకు పరుగు పెట్టాడు- 'రెయిన్బో గాడి అరుపుకి తాతమ్మ లేచిందేమో చూసొస్తా!' అంటూ.

(అయిపోయింది) 

టీచర్ : పిల్లలూ! నేను అడిగిన ప్రశ్నలకు వెంటనే ఠపీమని సమాధానం ఇవ్వాలి. చెప్పండి- మన దేశం పేరేంటి?



పిల్లలు: ఠపీ!




# ఆశల చెట్టు

*రచన : రెండవ తరగతి పిల్లలు, రాధా స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

పవన్, గణేష్ ఇద్దరూ ఒక రోజున వాళ్ళ ఊరి ప్రక్కనే ఉన్న అడవిలోకి వెళ్ళి, దారి తప్పారు. అడవిలో అంతా తిరిగి అలసిపోయారు. .

అంతలో వాళ్లకు ఎదురుగుండా ఒక పెద్ద చెట్టు కనబడింది. దాని కాండమే కాదు, పూలు, కాయలు అన్నీ బంగారం రంగులో మెరుస్తున్నాయి.

"ఈ కాయలు కోసుకుందాం. ఆకలి వేస్తు–న్నది" అన్నాడు గణేష్.

"ఇవి తినేందుకు పనికి రావేమో . ఇక్కడ ఒక్క పిట్ట కూడా లేదు చూసావా ?" అన్నాడు పవన్, తనూ చుట్టూ కలయ

చూస్తూ.

"కొన్ని కోసుకెళ్దాంలే; మా తాతకు తెలీని చెట్టు లేదు. కనీసం ఇది ఏం చెట్టో అయినా తెలుస్తుంది" అంటూనే గబగబా చెట్టు ఎక్కిన గణేష్, చకచకా కొన్ని కాయలు కోసి, పవన్ దగ్గరికి విసిరాడు.

పవన్ వాటిలోంచి ఒక కాయను తీసుకొని కొరికి చూసాడు.. కాయ చేదుగా ఉంది. చాలా గబ్బు వాసన కూడా!

గణేష్ కూడా దిగివచ్చి, ఆ కాయని నాకి చూసాడు. "ఛీ! అందుకనే వీటిని పిట్టలు కూడా తినట్లేదు" అంటూ తాము ఏరిన కాయలన్నీ పడేసారు ఇద్దరూ.

"ఒక్క కాయని మాత్రం తీసుకెళ్దాం. తాతని అడిగితే ఇది ఏం కాయో చెబుతాడు" అని అని ఒక్క కాయని మటుకు జేబులో వేసు–కున్నాడు గణేష్.

ఇద్దరూ దారులు, దిక్కులు చూసుకుంటూ అడవిలోంచి బయట పడి, అతి కష్టం మీద ఊరు చేరుకున్నారు.




గణేష్ వాళ్ల తాత మామూలుగా అయితే ఎప్పుడూ 'శక్తిలేదు' అని ముడుచుకొని పడుకొని ఉండేవాడు. అతను ఇప్పుడు ఆ కాయని చూడగానే లేచి గంతులు వేయటం మొదలు పెట్టాడు!

"ఇవి ఎన్ని తింటే అన్నేళ్ళు ఎక్కువ బ్రతుకు–తారట! ఈ బంగారు చెట్టు మీకు ఎక్కడ కనిపించింది? నన్ను అక్కడికి తీసుకపోండి!"

అంటూ.

పిల్లలు బిక్క మొహాలు వేసారు. దారి తప్ప– టం వల్ల అక్కడికి వెళ్ళగలిగారు గానీ , మళ్ళీ అక్కడికి వెళ్ళే దారి తెలీదు వాళ్ళకు !! "అయినా ఇది ఒట్టి పనికి మాలిన చెట్టు తాతా! వీటి కాయలు ఎంత చేదు , ఎంత గబ్బు! భరించలేం! బంగారం అయితే -నేమి, వెండి అయితేనేమి? ఇది ఒట్టి ఆశల చెట్టు! అంతే" అన్నారు పిల్లలిద్దరూ.

అయినా వాటి మీద ఆశ తోటి అడవి అంతా గాలించాడు తాత. ఎంత వెతికినా ఆ బంగారు చెట్టు కనిపించనే లేదు !

వందనాలు వందనాలు అభివందన చందనాలివీ-
మా అభివందన చందనాలివీ!
నాకు జన్మనిచ్చిన మా అమ్మకు-
నడక నేర్పిన మా నాన్నకు-
స్వేదం ఓడ్చి పని చేసే మా అమ్మానాన్నలకు
అభివందన చందనాలివి- నా అభినందన చందనాలివి!
ఎక్కడా తలదించని నాన్నకు- మంచి చెప్పే మా అమ్మకు-
ఆట పాటలు నేర్పించే మా అమ్మానాన్నలకిద్దరికీ
అభినందన చందనాలివి! చల్ల చల్లని చందనాలివి!
చదువు చెప్పె మా అమ్మకు- తప్పులు దిద్దే మా నాన్నకు
వేల వేల వందనాలివి- వేల కోటి వందనాలివి!

**మా మంచి టీచర్!**

నాకు చదువు చెప్పేది టీచర్
మంచి చేయమని చెప్పేది టీచర్
ఆటపాటలు నేర్పించేది టీచర్
నా తప్పులు సరిదిద్దేది టీచర్
ఆపద ఒస్తే అడ్డుకోమనేది మా టీచర్
ఇవన్నీ మాకు ఇచ్చి తాను ఏమి
ఆశించని మా గురువు లందరికీ ఇవే నా
నమస్కార సుమాంజలులు.

రచన: మౌనిక,6వ తరగతి, మహాత్మా జ్యోతిబా పులే తెలంగాణ గురుకుల పాఠశాల, కీసర, తెలంగాణ.



# దురాశ దు:ఖానికి చేటు

*"అందుకే దురాశ పనికిరాదు" అంటోంది కల్యాణి ఈ కథ రాసి పంపుతూ. నిజమే కదా?*

*రచన: కల్యాణి, పదవతరగతి, జహీరాబాద్, తెలంగాణ.*

శశాంక మహారాజుకు అడవులన్నా, అడవుల్లో తిరిగే జంతువులన్నా చాలా ఇష్టం . 'అడవి జంతువులకు సహజంగా అహారం దొరికితే , అవి ఇక జనాలుండే చోట్లకు రావు ' అని ఆయన విశ్వసించేవాడు.

క్రూరమృగాల కోసం ఆయన అడవుల్లో చిన్న చిన్న కుంటలు త్రవ్వించటం, గట్లు వేయిం-చటం వంటి చర్యలు చాలానే చేపట్టాడు. తన రాజ్యంలో అంతటా వేటను నిషేధించాడు కూడా.

ఆయన రాజ్యంలో మహేంద్రుడు అనే వేటగాడు ఉండేవాడు. రాజుగారు వేటను నిషేధించినా, వేటగాళ్లకు పునరావాసం కల్పించినా, మహేంద్రుడు మటుకు కరుడు

గట్టిన తన అలవాటును మానుకోలేక పోయాడు. ఎప్పుడు తోస్తే అప్పుడల్లా అడవికి వెళ్ళి, దొరికినన్ని జంతువుల్ని వేటాడి వాటిని రహస్యంగా అమ్ముకొనేవాడు . అట్లా కొద్ది కాలంలోనే చాలా ధనాన్ని కూడబెట్టాడు కూడా. అయినా అతనికి డబ్బు మీద యావ పోలేదు.



ఒకసారి అట్లా వేటకోసం అడవికి వెళ్ళిన మహేంద్రుడికి గుంపులు గుంపులుగా పో - తున్న జింకల మందలు కనిపించాయి . అతను వాటి వెంట పడి పరుగెడుతూనే విల్లెత్తి బాణం వదిలాడు . అది సూటిగా పోయి ఒక జింకకు తగిలింది . అయితే ఆశ్చర్యంగా, ఆ జింక కాస్తా ఒక వన దేవతగా మారింది: "ఓయీ మహేంద్రా ! జీవులను హింసించాలనే నీ క్రూరమైన ఆలోచనను మాను. మన రాజ్యంలో వేట నిషేధింప - బడిందని నీకు తెలియదా?" అన్నది.

మహేంద్రుడు ఆశ్చర్యపోతూనే "తల్లీ! వే- టాడటకపోతే నా పొట్ట ఎట్లా నిండుతుంది , చెప్పు?! ఆకలి తీర్చుకునేందుకు గాను ఏ పని చేసినా తప్పు లేదు కదా!" అన్నాడు.

"దానిదేమున్నది?! నీ దగ్గర చాలానే డబ్బు ఉన్నది కదా, ఆ డబ్బుతో హాయిగా జీవిం - చవచ్చు!" అన్నది వనదేవత.

"తింటూ కూర్చుంటే కొండలైనా కరిగి పో - తాయట కద తల్లీ?!" అన్నాడు మహేంద్రుడు తెలివిగా.

వన దేవత కొంచెం ఆలోచించి , చిరునవ్వు నవ్వి, "సరేలే! మంచి మనిషిగా మారేందుకు నీకు కూడా అవకాశం రావాలిగా ? అలాగే కానివ్వు. ఇప్పుడు నీకో పాత్రను ఇస్తాను . ఆ

పాత్ర ప్రతిరోజూ ఒక తులం బంగారం ఇస్తుంది. నీ ఖర్చులకు అది చాలా ఎక్కువే.



అట్లా నీ అవసరాలకు పోగా మిగిలిన సొమ్మును దాన ధర్మాలకు వినియోగించు . నీకు మంచి కీర్తి ప్రతిష్టలు లభిస్తాయి . ఇక జంతుహింసను మానెయ్యి " అంటూ ఒక పాత్రని అతని చేత పెట్టి అదృశ్యం అయిపో –యింది.

మహేంద్రుడికి చాలా సంతోషం వేసింది . అయితే మరుక్షణం "ఒక్క తులమేనా?" అని విచారం కూడా వేసింది - "ఇట్లాంటి పాత్రలు మరిన్ని కావాలి! ఒక్క తులం అంటే చాలా తక్కువ!"

దురాశాపరుడైన మహేంద్రుడు తన వేటని కొనసాగించాడు. మరొక జింక మీదికి బాణం వదిలాడు. "ఇట్లాంటి పాత్రలు మరో పది ఇమ్మంటాను, వనదేవతని!" అనుకున్నాడు.

అతను విడిచిన బాణం జింకకు తగిలింది . అది ప్రాణం విడిచింది ; కానీ వనదేవత మాత్రం తిరిగి రాలేదు . అంతలోనే అటుగా వచ్చిన సైనికులు మహేంద్రుడిని పట్టి బంధించారు. పాత్రతో సహా వాడిని రాజుగారి ముందు ప్రవేశపెట్టారు . రాజుగారు పాత్రను ఖజానాకు పంపారు; వన్య ప్రాణిని వేటాడిన మహేంద్రుడికి యావజ్జీవ కారాగార శిక్ష పడింది!

ఈరోజు మనం ఏం చేస్తాం అన్న దాని మీదనే మన భవిష్యత్తు ఆధారపడుతుంది.




# వంకాయలు-వ్యాపార రహస్యం

*రచన: కె.నిఖిల, 9 వతరగతి, ZPHS సంజీవపురం, గార్లదిన్నె మండలం, అనంతపురం జిల్లా.*

వరదాపురం గోవిందమ్మది పాల వ్యాపారం. రైతులనుండి పాలు సేకరించటం, కొద్దిపాటి లాభంతో ఇళ్ళ వారికి పోయటం ఆమె వృత్తి. తన పని పట్ల నిబద్ధత ఉండటం వల్ల, ఊళ్ళో అందరూ ఆమెను అభిమానించేవాళ్ళు.

గోవిందమ్మ ఇంటికి ఎదురుగా రంగమ్మ , కూరగాయల వ్యాపారం చేసేది. "నువ్వు రైతు దగ్గర కొనే రేటుకే నాకు పొయ్యాలి . మనం మనం వ్యాపారులం, ఎదురు బొదురు ఇళ్ళ వాళ్ళం. మన మధ్య లాభాల లెక్కలు ఉండకూడదు" అంటూ తను తీసుకెళ్ళే పాలకు తక్కువ డబ్బులు ఇచ్చేది. రంగమ్మ పిసినారితనం తెలిసిన గోవిందమ్మ కూడా , 'సర్లే కానియ్యుమ'ని ఊరుకునేది.

గోవిందమ్మకు గుత్తి వంకాయకూర అంటే చాలా ఇష్టం. తన ఇంటి ప్రక్కన ఉండే

కాంతమ్మ కూరగాయలు పండిస్తుంది.

ఓసారి గోవిందమ్మ కాంతమ్మ ఇంటికి వెళ్ళి "అక్కా వంకాయలు వున్నాయా ?!" అని గట్టిగా రెండు, మూడు సార్లు కేకలు వేసింది.



కాంతమ్మ "వస్తున్నానమ్మా" అంటూ బయ–టకు వచ్చి, గోవిందమ్మను చూసి "నువ్వా! రా! లోపలికి రా!" అని ఆహ్వానించింది.

"ఏమీ లేదు కాంతమ్మక్కా, నాకు ఒక కిలో పాటి వంకాయలు కావాలి - ఉన్నాయా?" అడిగింది గోవిందమ్మ.

"అయ్యో ఐదు కిలోల వంకాయలు ఉంటే, ఇప్పుడే రంగమ్మకు ఇచ్చాను. కిలోకు ఇరవై ఇస్తానంది. నీకు ఎన్ని కావాలో అన్ని తీసుకో, ఆమె దగ్గర- నేను చెప్పానని చెప్పు!" అన్నది కాంతమ్మ.

"సరేలే అక్కా! దానిదేమున్నది, నీ దగ్గర తీ–సుకున్నా, రంగమ్మక్క దగ్గర తీసుకున్నా ఒకటేగదా! వెళ్ళొస్తాను" అంటూ గోవిందమ్మ రంగమ్మ ఇంటికి పోయింది.

"రంగమ్మక్కా! వంకాయలున్నాయటగా, నీ దగ్గర?!" అన్న గోవిందమ్మతో, రంగమ్మ "ఉన్నాయి. కిలో కేవలం యాభై. నీకు ఎన్ని కావాలి?" అని అడిగింది.

"అమ్మ బాబోయ్, యాభై రూపాయలే ! కాంతమ్మ ఇరవై రూపాయలకే ఇస్తావన్నది ?" అంది గోవిందమ్మ.

"వాళ్ళు పండించినవి కాబట్టి, ఏదో ఒక రేటుకు అమ్ముకుంటారు. మనకు ఆ రేటు గిడుతుందా!" అంది గడుసు రంగమ్మ.

"ఏమయితేనేమిలే అక్కా, అవీ వంకాయలే-

ఇవీ వంకాయలే ! ఇరవై రూపాయలకు ఇస్తావా?" అని అడిగింది గోవిందమ్మ.



"మేం పట్నం నుంచి తెస్తామమ్మా, మంచి వంకాయలు! వాటిని తెచ్చేందుకే చాలా ఖర్చువుతుంది. ఇరవైకి ఏమాత్రం గిట్టదు " అని రంగమ్మ అంది.

"నువ్వు తెచ్చింది కాంతమ్మ దగ్గరేగా , పోనీ వీటిని ముప్ఫై రూపాయలకు ఇచ్చెయ్యి ! అయినా నీకు పది లాభమే !" అంది గోవిందమ్మ.

"కుదరదు. యాభైకి తక్కువ లేదు" అనే–సింది రంగమ్మ.

అంతే! ఇక మరుసటి రోజునుండీ గోవింద–మ్మ పాలతో బాటు కూరగాయలు కూడా అమ్మటం మొదలు పెట్టింది.

కూరగాయలు పండించే రైతులకు ఆమె దగ్గర ఎక్కువ ధర దొరికింది; కొనేవాళ్లకు తక్కువ ధరకు దొరికినై, కూరగాయలు!

అత్యాశకు పోయిన రంగమ్మకు మాత్రం పాల రేటు కూడా ఎక్కువయింది!

**సెల్ ఫోన్ తెలివి!**

టీచర్: ఒరే రవీ! భూమి లోపల కరిగి ఉండే రాళ్ళ ద్రవాన్ని ఏమంటారు?!

రవి: లావా అంటారు సర్!

మరి వెంకటేశూ, భూమి పైన ఎత్తుగా పెరిగి ఉండే నిర్మాణాల్ని ఏమంటారు?

వెంకటేశు: 'ఓపో' అనో, 'వివో' అనో అంటారనుకుంటా సర్!






# పుచ్చకాయ కథ

రెండు పేజీల కథ

*రచన: సాముల శశిధర్ రెడ్డి, 9 వ తరగతి, తేజ విద్యాలయ, కోదాడ.*

*మార్పు చేర్పులు: కొత్తపల్లి*

నారాయణ రెడ్డి- నాగలక్ష్మి దంపతులకు ఇద్దరు కొడుకులు, ఒక కూతురు- శశి, కిరణ్, వైష్ణవి.

అది మంచి వేసవి కాలం . పిల్లలందరికీ సెలవలు. నారాయణ రెడ్డి ఆ రోజు ఉదయం బజారునుండి ఒక పుచ్చ కాయని తెచ్చాడు. పిల్లలంతా అది చూసి చాలా సంబరపడ్డారు.

నారాయణరెడ్డి దాన్ని ఐదు భాగాలు చేసా – డు. మొత్తంగా ఫ్రిడ్జ్‌లో పెడుతూ "అందరం తలా ఒక ముక్కా తిందాం , సరేనా?! మధ్యాహ్నం అన్నం తిన్న తరువాతే తినాలి!" అన్నాడు. పిల్లలంతా 'సరే' అన్నా– రు.

కానీ కిరణ్ మటుకు ఆగలేకపోయాడు . వాడి మనసంతా "తిందాం తిందాం " అని తొందరపెట్టింది. అందరూ 'మధ్యాహ్నం' అని ఊరుకున్నారు కదా , కిరణ్ మాత్రం

ఎవరికీ తెలవకుండా ఫ్రిజ్‌లోంచి ఒక ముక్క తీసుకొని తినేసాడు.




మధ్యాహ్నం అందరూ కలిసి భోజనం చేసాక, నారాయణ రెడ్డి "ఇప్పుడింక పుచ్చకాయ ప్రోగ్రాము" అంటూ వెళ్లి ఫ్రిజ్ తలుపు తెరచి చూసాడు. అందులో ఒక ముక్క లేదు!

నారాయణ రెడ్డి దాన్నే తెచ్చి ముందు పె –డుతూ "మీ నలుగురిలో ఎవరు, వాళ్ల వాటా పుచ్చకాయ తినేసింది?" అని అడిగాడు.

"నేను తినేసా" అని చెబుదామనుకున్నాడు కిరణ్. కానీ 'ఎందుకు తిన్నావు?' అని కో–ప్పడతారేమో?! -అని, నోరు మెదపలేదు.

"సరే, పర్లేదులే, మనలో ఎవరికో చాలా ఆకలి వేసి ఉంటుంది . మిగిలిన దాన్నే మనం అందరం పంచుకుందాం " అని నవ్వి , ఆ మిగిలిన నాలుగింటినే అందరికీ సమానంగా పంచాడు నారాయణ రెడ్డి.

"ఇది తప్పు ! అందరికీ కొంచెం కొంచెం తగ్గిపోతుంది!" గొణిగాడు పెద్దోడు.

"నేనేలే, తిన్నది! బాగా ఆకలివేసేసరికి , ఆగలేక తినేసాను. ఇప్పుడు ఇవన్నీ మీకే !" అన్నాడు కిరణ్, నోరు విప్పి.

నారాయణ రెడ్డి వాడి భుజం తడుతూ "ఏమీ పర్లేదు. ఈ సారి ఇంకా పెద్ద పుచ్చ –కాయ తెచ్చుకుందాం. ఏదైనా సరే, అందరం కడుపునిండా తినటం ముఖ్యం . ఎప్పుడు తిన్నా, ఉన్నదాన్నే సమానంగా పంచుకొని తిందాం!" అన్నాడు.

ఆశ్చర్యం, అటు తర్వాత ఎప్పుడూ ఇంట్లో పంపకాల సమస్య రాలేదు.



# నిర్లక్ష్యం

మూడు పేజీల కథ

*రచన: అంజి, 8 వ తరగతి, క్రాస్‌వర్డ్ స్కూల్, గుంటూరు*

ఒక ఊళ్ళో రాజు అనే పిల్లవాడు వుండేవాడు. అతనికి ఏ పని చేయాలన్నా చాలా నిర్లక్ష్యం . ఒక రోజున వాళ్ల అమ్మ అతనికి ఒక పని చెప్పింది: వాళ్ల వీధి చివర్లోనే , చెక్కపని చేసే వడ్రంగి ఒకడు ఉంటాడు . 'అతన్ని రమ్మని చెప్పురా, కుర్చీలు - మంచాలు అన్నీ చిన్న చిన్న రిపేర్లు ఉన్నాయి' అని.

"అబ్బ! అమ్మా! టైం ఐపోతున్నది . నేను ఇంకా తల దువ్వుకోవాలి; బ్యాగు సర్దుకో–వాలి!" అన్నాడు రాజు.

"ఇప్పుడు చెప్పక్కర్లేదులే , నువ్వు బడికి పోయేటప్పుడు ఎట్లాగూ వాళ్ల దుకాణం ముందునుండే వెళ్తావుగా ? అప్పుడు చెబితే చాలు!" అన్నది అమ్మ.

"సరేలే! అప్పుడు చెబుతాను !" అన్నాడు

రాజు.

రాజు స్కూలుకు బయలుదేరుతుంటే మళ్ళీ గుర్తు చేసింది అమ్మ - "వడ్రంగిని పిలవాలి" అని.

"అబ్బ! ఎన్నిసార్లు చెప్తావమ్మా! నేను పిలు–స్తానన్నానుగా?!" అన్నాడు రాజు.



అనటమైతే అన్నాడుగాని, వాడు ఆ సంగతి మర్చేపోయాడు. నేరుగా బడికి వెళ్ళిపో–యాడు.

కనీసం సాయంత్రం బడినుండి వచ్చేటప్పుడు కూడా వాడికి వడ్రంగి మాట గుర్తుకు రాలే–దు. తీరా ఇంటికి వచ్చాక వాళ్ళ అమ్మ "నేను వడ్రంగిని పిలువమని చెప్పాను కదా , పిలిచావా?" అని అడిగింది.

"రేపు చెబుతానులేమ్మా!" అన్నాడు రాజు.

తర్వాతి రోజు ఉదయాన్నే అమ్మ "ఇంట్లో వైరింగుతో ఏదో సమస్య ఉన్నది . వడ్రంగి దుకాణం ప్రక్కనే కరెంటు పని చేసే అన్న ఉంటాడు. అతన్ని కూడా పిలు!" అన్నది.

"అబ్బ! ఎప్పుడూ ఏదో ఒక పని చెబ్తానే ఉంటావు! మళ్ళీ పిలుస్తాన్లేమ్మా!" అన్నాడు రాజు.

తరువాత వాడు అది కూడా పూర్తిగా మర్చి పోయాడు.

ఇట్లా అమ్మ రోజూ ఏవో పనులు గుర్తు చేయటం; రోజూ రాజు ఇలాగే జవాబులి–వ్వటం- పనులు మాత్రం జరగనే లేదు.

అంతలో రాజు పుట్టిన రోజు వచ్చింది . ప్రతి సారి లాగానే ఈసారి కూడా వాళ్ల ఫ్రెండ్స్‌ని

బర్త్‌డే పార్టీకి పిలవాలని ఉత్సాహపడ్డాడు రాజు.




"సరేలే, రమ్మను అందరినీ" అన్నది అమ్మ.

"అలాగే ఆ చెక్కపని చేసే అతన్ని కూడా పిలువు- ఇంట్లో కుర్చీలు మంచాలు ఏవీ అస్సలు బాగా లేవు" అన్నది.

ఆ రోజు కూడా వడ్రంగిని పిలవలేదు రాజు . ఇంక సాయంత్రం అవుతుందనగా అతని మిత్రులంతా వచ్చారు. వాళ్ళు వచ్చి మంచం మీద కూర్చోగానే మంచం విరిగిపోయింది . కుర్చీల్లో కూర్చోమంటే కుర్చీలు విరిగి – పోయాయి. అంతలో సాయంత్రమైందని కరెంటు స్విచ్ వేయగానే టప్ మంటూ లైట్లు అన్నీ ఆఫ్ అయిపోయాయి ! పార్టీ అంతా చీకట్లోనే నిలబడి, క్యాండిళ్ల వెలుగులో జర–పాల్సి వచ్చింది.

మిత్రులంతా వాళ్ల వాళ్ళ ఇళ్ళకు వెళ్లిపోయాక కూడా అమ్మ ఏమీ అనలేదు . అయినా అప్పుడు అర్థమైంది రాజుకి - 'ఎప్పుడు చేసే పనిని అప్పుడే చేయాలి' అని!

**తెలివైన పిల్లాడు!**



టీచరు: సెమిస్టరు విధానం వల్ల లాభాలు ఏంటో చెప్పు రామూ!

రాము: బలే లాభాలున్నై మేడం. పరీక్షలు రెండు సార్లు రాయచ్చు; ఆ సమయంలో క్లాసులు జరగవు... అంతే కాదు ఒకసారి చదివినదాన్ని ఆర్నెల్లకే మర్చిపోవచ్చు- ఏడాది పాటు గుర్తుంచుకునే శ్రమ ఉండదు.




# పద్యాల కథ

*రచన: వినోద్ కుమార్, 10 వ తరగతి, చిప్పగిరి, కర్నూలు జిల్లా.*

నమస్తే! నా పేరు రాజేష్. నేను చిప్పగిరిలో ఉన్న జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో చదువుతున్నాను, మా అమ్మ పొద్దున్నే పొలానికి వెళ్తుంది ; మా నాన్న ఆఫీసుకు వెళ్తారు. నేను బడికి వెళ్లి చదువుకుంటాను . మా క్లాస్‌లో నేనేమీ మొదటి ర్యాంకర్‌ను కాదు; కాకపోతే బాగానే చదువుతాను . ఆటలు కూడా బాగానే ఆడుతాను . మా బడిలో ఉన్న ఉపాధ్యాయులందరూ నన్ను బాగా ప్రోత్సహిస్తారు.

కానీ మా ఇల్లు చాలా చిన్నది . అందుకని నేను మా ఊరికి చివర్లో ఉన్న కొండనెక్కి అక్కడ కూర్చొని చదువుకుంటాను. అక్కడ ఏవైనా చెట్ల క్రింద గడ్డిలో కూర్చోటం , రక రకాల జంతువుల్ని, పక్షుల్ని చూస్తూ చదువుకోవటం బాగుంటుంది. మా బడిలో

కూడా చాలా రకాల మొక్కలు ఉన్నాయి . అందులో నాది కూడా ఒక మొక్క ఉంది ! నేను దానికి రోజు నీళ్ళు పోస్తాను కూడా!.

మా తెలుగు పండితులకు ఒక కోరిక ఉం – డేది. అది ఏంటంటే , 'మా బడిలోంచి మూడు వందల మంది విద్యార్థులు ఒకేసారి వంద వేమన పద్యాలు గానం చేస్తుంటే వి – నాలి' అని.



మేమందరం 'సరే సర్' అన్నాం ఉత్సాహంగా. తెలుగు అయ్యవారు ఒక పెద్ద పేజీ నిండా పద్యాలు రాసి , ఫొటో కాపీ చేసి , మాకు అందరికీ తలా ఒకటీ ఇచ్చారు . అందులో 28 పద్యాలు మాత్రమే ఉన్నాయి. అందులో కొన్ని పద్యాలు మాకు అంతకు ముందే నోటికి వచ్చు! అందుకని అందరం వాటిని త్వరగానే నేర్చుకున్నాము.

అయితే వాటి తర్వాతి పద్యాలు రాసిన పేపరును మాకు ఇవ్వలేదు అయ్యవారు. మా క్లాస్ లీడరుకు మాత్రమే ఇచ్చి , "అందరూ వాటిని చూసో , చెప్పించుకొనో రాసుకోండి" అన్నారు. "ఎందుకట్లా?" అని ఆశ్చర్యపోతుంటే అయ్యవారే చెప్పారు : "మొదటి ఇరవై ఎనిమిదీ మన మెదడులోకి తొందరగానే పోతాయి ; కానీ ఇప్పుడిచ్చేవి వాటికి అదనం కదా, అందుకని అంత సు– లభంగా ఎక్కవు - గుర్తు పెట్టుకునే సామ – ర్థ్యాన్ని 'ధారణ' అంటారు. మన 'ధారణ శక్తిని 'మనమే, ప్రయత్నించి వృద్ధి చేసుకో– వాలి. 'మనసు పెట్టి జాగ్రత్తగా, ఒక్కసారన్నా రాయటం' అనేది ఐదుసార్లు పైపైన చదవటం

కంటే మెరుగు' అని చెబుతారు. అందుకని మీరు మనసు పెట్టి రాసారనుకోండి , ఈ ఇరవై ఎనిమిదీ కూడా త్వరగా నోటికి వచ్చే–స్తాయి!" అని.

మేమందరం ఆ పద్యాల్ని చూసి రాసుకు–న్నాం, మా రఫ్ నోట్సుల్లో.




ఆ మరుసటిరోజు సెలవు వచ్చింది. "ఈ రో–జు సెలవు కదా! పద్యాలన్నీ నేర్చేసుకుంటా–ను" అనుకుంటూ కొండ పైకి వెళ్లాను.

ఒక్కో పద్యాన్నీ గొంతెత్తి రాగం పెట్టి పాడు–కుంటూ పోయాను. గట్టిగా పాడితే పద్యాలు చాలా తొందరగా వచ్చేస్తాయి ! అట్లా కొద్ది సేపటికే నాకు చాలా పద్యాలు వచ్చేసాయి!

అయితే ఎందుకనో, ఆ రోజు కొండ ఎక్కేం–దుకు చాలామంది పిల్లలు , పెద్దవాళ్ళు, గుంపులు గుంపులుగా వచ్చారు.

వాళ్ల ముందు నేను ఇంక గట్టిగా పాడలేను కదా, అందుకని నోరు మూసుకొని , ఒక మూలన కూర్చుని, మనసులోనే చదవటం మొదలు పెట్టాను. ఒక పద్యం నేర్చుకునేం–దుకు పది పది సార్లు చదవాల్సి వచ్చింది. రెండు మూడు పద్యాలు నోటికి వచ్చేసరికి ఆవలింతలు కూడా మొదలైనాయి!

అంతలో అక్కడికి ఒక సాధువు వచ్చాడు . ఆయనకు చాలా మంత్రాలు వచ్చు. ఆయన వెనకనే రకరకాల జంతువులు - ఒక యాభైయో, వందో వచ్చాయి. వాటిలో కోళ్ళు, గొర్రెలు, మేకలతో బాటు గుర్రం , ఏనుగు, ఎలుగు బంటి లాంటివి కూడా

ఉన్నాయి!




ఆయన నా ప్రక్కనుండే నడచుకుంటూ కొండ ఎక్కి పోయాడు, కానీ ఆయన వెనక వచ్చే జంతువులు మాత్రం ఒక్కటొక్కటిగా నా చుట్టూ ఆగాయి . ఎందుకనో. నాకు వాటిని చూసి భయం వేసింది . వాటిలోంచి ఎలుగుబంటి నా దగ్గరకు వచ్చి - " నీ రఫ్-నోట్సు ఇటు ఇవ్వు" అంది.

నాకు చాలా ఆశ్చర్యం వేసింది : 'ఎలుగు బంటి తెలుగులో మాట్లాడటం ఏంటి , రఫ్-నోట్సు అడగటం ఏంటి?'

గబగబా నా చేతిలో ఉన్న రఫ్ నోట్సును దాని చేతికి ఇచ్చాను. అది దాన్ని చూసుకుంటూ ఒక్కొక్క పద్యాన్నే రాగంతో సహా పాడటం మొదలు పెట్టింది.

అది అట్లా పాడగానే కోతి కూడా మొదలు పెట్టింది. అంతలోనే ఎక్కడినుండో ఎగురు-కుంటూ వచ్చిన రామచిలుక, అది కూడా మొదలు పెట్టింది- ఆ పద్యాలు అన్నిటినీ చూడకుండానే పాడింది! చూస్తూ చూస్తూ ఉండగానే చాలా జంతువులు వేటికవి , వేమన పద్యాలు పాడటం మొదలు పెట్టాయి.

అదంతా చూస్తూంటే నాకు ఎంత ఆనందం అనిపించిందో, నేను మాటల్లో చెప్పలేను. 'నా తెలుగు భాష ఎంత గొప్పది! అమ్మ భాష ఎంత కమ్మనిది!' అంటూ పద్యాల పోటీలో పాల్గొని, విజేత నయ్యాను. బహుమతిని అందుకుంటూ కేరింతలు కొట్టాను!"

అంతలో నా చేతులు మా అమ్మకు తగిలిన-

ట్లున్నాయి, తను లేచి కూర్చుని "ఏమిరా! నిద్రపోతూనే డాన్సు చేస్తున్నావు?! కలవరించుకుంటున్నావా, నిద్రలో?" అని గట్టిగా అరిచింది.

గబుక్కున మెలుకువ వచ్చింది: చూస్తే మంచంపైన మా అమ్మ దగ్గర పడుకుని ఉన్నాను!

అయితే ఆ తర్వాత నాకు పద్యాలు అన్నీ చాలా త్వరగా వచ్చేసాయి - అంతకు ముందు అవన్నీ కలలో నేర్చుకున్నవేగా , అందుకనే కావచ్చు!



పొడుపు కథలు- సౌజన్యం: డా. పత్తిపాక మోహన్, సిలిసిల్ల జిల్లా.



1. ఎర్రని కోటలో తెల్లని కావలి వాళ్ళు
2. ఎలుకలు తినని పాము పంటలకు ప్రియుడు
3. ఎవరు దిగని బావిలో భీముడు దిగుతాడు.
4. ఎంత వాదినా అరగని బిళ్ళ, కరగని బిళ్ల
5. ఏటిలో కర్రముక్క ఎదురు వెళుతుంది
6. ఏడాకుల మర్రిచెట్టు ఎక్కలేరు, దిగలేరు
7. ఏడు ఎకరాల మాను వంగి నీరు తాగుతుంది.
8. ఏటి అవతల ఒక పండు, ఏటి ఇవతల ఒక పండు

జావాబులు: 1.పండ్లు 2.వానపాము 3.తెడ్డు 4.అరుగు 5.పడవ 6.పట్టెమంచం 7.ఇంద్రధనస్సు 8.పెదవులు



# బాగున్న సమయం

*"ఒక్కోసారి మనం 'సమయం బాలేదు' అని నిరాశ పడుతుంటాం గానీ, జాగ్రత్తగా చూస్తే ఆ సమయంలో కూడా ఏదో ఒకటి బాగానే ఉంటుంది " అంటూ ఈ కథ రాసి పంపాడు రామాంజనేయులు . చదివి, అవునో కాదో చెప్పండి మీరున్నూ.*

*రచన: బి.రామాంజినేయులు, 8 వ తరగతి, కంకణాలపల్లి, ప్రకాశంజిల్లా*

కంకణాలపల్లిలో ఉండే వెంకటయ్య , భవన నిర్మాణంలో సెంటరింగ్ పనులు చేస్తాడు . ఒక రోజున వాళ్ల ఇంట్లో వాళ్ళు అందరూ బంధువుల పెళ్ళికని బయలుదేరారు. వెంక–టయ్య మాత్రం 'నేను రాను -నాకు పని ఉంది" అన్నాడు. ఎంత చెప్పినా వినక–పోయే సరికి, 'సరేలే, నీ పనేదో చూసుకో' అని అతన్ని విడిచిపెట్టి మిగిలినవాళ్ళంతా

పెళ్ళికి వెళ్ళారు.

ఎన్నడూ లేనిది, ఏమైందో ఏమో, ఆ రోజున చెక్క కొడుతూండగా కర్ర జారి, వెంకటయ్య క్రింద పడ్డాడు. కాలికి మేకు గుచ్చుకొని పెద్ద గాయం అయ్యింది. "తనని ఆసుపత్రికి తీసుకుపోయేందుకు కూడా ఎవ్వరూ లేరు" అని బాధ వేసింది అతనికి. "అంత బాధ్యత లేకుండా వదిలేసి వెళ్ళారు. వాళ్ళెవరైనా వచ్చే వరకూ నేను ఆసుపత్రికి పోనే పోను " అని, గాయానికి సొంత కట్టు కట్టుకున్నాడు, వెంకటయ్య.

తీరా వంట చేసుకుందామని చూస్తే, పొయ్యిలోకి కట్టెలు లేవు . వాళ్ళ ఇంటికి దగ్గర్లోనే ఓ అడవి ఉంది. అక్కడికి వెళ్లి పుల్లలు తెద్దామని, గాయమైన ఆ కాలితోనే కుంటుకుంటూ అడవిలోకి వెళ్ళాడు వెంకటయ్య. అక్కడ విరిగిన ఎండు కొమ్మలని పట్టుకోగానే, ఎన్నడూ లేనిది అవి కాస్తా విరిగి మీద పడ్డాయి! కాలికి మళ్ళీ గాయాలు అయ్యాయి. ఆ చుట్టుప్రక్కల మనుషులు కూడా ఎవ్వరూ లేరు- దాంతో అతనికి వెనక్కి నడిచి రాక తప్పలేదు.

ఊరి శివార్లలోనే ఓబులయ్య వాళ్ల ఇల్లు ఉన్నది. కాలునొప్పికి తట్టుకోలేని వెంకటయ్య, ఆ ఇంటి బయట అరుగు మీదే విశ్రాంతిగా కూర్చున్నాడు .

సరిగ్గా అప్పుడే ఆ అరుగు ముందు ఎవరో ఇద్దరు వ్యక్తుల మధ్య కొట్లాట మొదలైంది. చూస్తూండగానే మంది జమ అయ్యారు అక్కడ. వ్యక్తుల మధ్య పోట్లాట కాస్తా వర్గాల మధ్య గొడవగా పరిగణించింది. ఆ గొడవలో ఎవరో విసిరిన కర్ర ఒకటి ఎగిరి వచ్చి, వెంకటయ్యకు తగిలింది! 'గొడవలు జరిగే చోటుకు పోవద్దు! అని చిన్నప్పుడు అమ్మ నాన్న ఎంత ముద్దుగా చెప్పారు; నేను విననేలేదు" అని బాధ పడ్డాడు వెంకటయ్య, కొంచెం ముందుకు వెళ్ళి ఓ చెట్టు క్రింద కూర్చుంటూ.



అట్లా దూరంగా కూర్చొని, కర్ర తగిలిన చోట కట్టు కడుతూనే, ఇంకా కొనసాగుతున్న గొడవను గమనించటం మొదలు పెట్టాడు అతను. ఆలోగా గొడవ ఇంకాస్త పెద్దదైంది. ఒక దశలో "ఇది బాగా పెద్దదవుతోంది- పోలీసులు వస్తారేమో !" అని అనుమానం వచ్చింది అతనికి. అయితే అక్కడినుండి పోవాలని అతను అరుగు దిగేలోపే పోలీసులు వచ్చి చేరారు ; అక్కడున్న వాళ్లందరినీ పట్టుకొని వ్యాను ఎక్కించారు! ఆ పరిసరాల లోనే, చెట్టు క్రింద గాయాలతో ఉన్న వెంకటయ్యను చూసి, "వీడు కూడా గొడవ వాడే అయి ఉంటాడు !" అని అతన్ని కూడా పట్టుకొని పోలీసు స్టేషన్‌కు తీసుకెళ్ళారు.

"అయ్యో! అనవసరంగా పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాల్సి వచ్చింది!" అని మొదట కోపం తెచ్చుకున్న వెంకటయ్య, చివరికి తనకు తానుగా శాంతపడి, పోలీసుల్ని బ్రతిమాలుకొని, మెల్లగా ఇల్లు చేరుకోవాల్సి వచ్చింది.

వచ్చేసరికి ఇంటి తలుపులు బార్లా తెరచి ఉన్నాయి! "మా వాళ్ళు వచ్చేసినట్లున్నారు!" అని సంతోషంగా లోనికి అడుగు పెట్టిన వెంకటయ్యకు పై ప్రాణాలు పైనే పోయాయి! ఇంటిని దోస్తున్న దోపిడీ దొంగలు అతన్ని చితక బాది, కొన ప్రాణాలతో వదిలారు!

"నాకు సమయం బాగా లేదు ! ఏం చేసినా ఎదురు తిరుగుతున్నది" అని నిరాశపడ్డాడు వెంకటయ్య. ఆ నిరాశలోనే వాడు గమ్యం తెలీకుండా నడుస్తూ అడవిలోకి పోయాడు. అక్కడ వాడికి అకస్మాత్తుగా ఏవో గొంతులు వినబడ్డాయి. చూడగా వాళ్ళు తన ఇంటిని

దోచుకున్న దొంగలే! వెంకటయ్య వణికి–పోతూ, అక్కడికి దగ్గర్లోనే ఉన్న ఓ మర్రి చెట్టు ఎక్కి కూర్చుని స్పృహ తప్పిపోయాడు.



ఎంత సేపు అట్లా ఉన్నాడో తెలీదు- తిరిగి అతనికి మెలకువ వచ్చే సరికి దొంగలు ఏవో మూటలు ఎత్తుకొని, అతను ఎక్కి ఉన్న చె–ట్టు దగ్గరికే చేరుకుంటున్నారు ! కొమ్మల సందుల్లోనుండి వెంకటయ్య చూస్తూండగానే అందరూ ఆ మూటల్ని చెట్టు తొర్రలో పెట్టు–కొని వెళ్ళిపోయారు! వాళ్ళు వెళ్ళాక చాలా సేపటికి గాని వెంకటయ్యకు క్రిందికి దిగి వచ్చేందుకు ధైర్యం చాలలేదు . తర్వాత మెల్లగా మూటలు విప్పి చూస్తే వాటి నిండా నగలు, సొమ్ములు!

"అంత సొమ్మును ఏం చేయాలి , దాన్ని ఇంటికి ఎట్లా చేరవేయాలి?" అని ఆలో–చించిన వెంకటయ్య, చివరి నిముషంలో మనసు మార్చుకొని, పోయి, పోలీసులకు కబురందించాడు. పోలీసులు ఆ మూటల్ని స్వాధీనం చేసుకోవటమే కాక , వాటికోసం తిరిగి వచ్చిన దొంగల్ని కూడా పట్టుకున్నారు!

అట్లా 'సమయం బాగాలేదు' అని చిన్నబో–యిన వెంకటయ్యకు తమ సొమ్ములు తిరిగి దక్కటమే కాక, అదనంగా పోలీసులు ఇచ్చిన బహుమతులు కూడా లభించాయి!

ఆత్మాభిమానం

టీచర్: చింటూ, మన టెక్నాలజీ మారిపోతున్నది కదా? పదేళ్ల క్రితం లేనివి మనకు ఈ రోజున ఉన్నాయి. దీనికి ఒక ఉదాహరణ చెప్పు!

తొమ్మిదేళ్ల చింటూ : నేనే టీచర్. పదేళ్ల క్రితం లేను, ఇప్పుడున్నాను చూడండి!



# మాయ దీపం

*మూలం: ఆసిఫ్, 9 వ తరగతి, Z.P.H.S.స్కూల్, చెన్నేకొత్తపల్లి.* *మార్పులు: కొత్తపల్లి.*

రామయ్య అమాయకుడు , ఎప్పుడూ మాయ మంత్రాల గురించి ఆలోచిస్తూ ఉండేవాడు. "అల్లాఉద్దీన్ కథలోలాగా నాకు కూడా ఒక మంత్రాల దీపం దొరికితే ఎంత బాగుంటుంది?! భూతం "నీకేం కావాలో చెప్పు. తెచ్చిస్తాను" అని అడిగితే ఎంత బా–గుంటుంది?!" అని, గాలిమేడలు కట్టుకుం–టూ ఉండేవాడు.

"ఎప్పుడూ అట్లా పడుకొని ఉండకు- కొంచెం పని చెయ్యి!" అని వాళ్ల అవ్వ పోరుతుండేది. చివరికి వాడు ఇంక ఆ పోరును తట్టుకోలేక, పట్నం బయలు దేరాడు.

అయితే దారిలోనే వాడు బాగా అలసిపోయి, ఓ చెట్టు క్రింద చేరగిలబడ్డాడు. మనిషైతే ఆగిపోయాడు కానీ , ఆలోచనలు ఆగవు కదా? అవి వాడిని నడిపించాయి...

ఆ రోజున పట్నంలో ఎక్కడలేని తినుబండారాలు, వింత బొమ్మలు కనిపించాయి వాడికి. తినుబండారాలను చూడగానే వాడికి నోరూరింది; బొమ్మల్ని చూడగానే పనులు చేసిపెట్టే భూతం గుర్తుకొచ్చింది. వాడు అట్లా నిలబడి ఉంటే, దుకాణం అతను "ఏం కావాలి నీకు?" అని అడిగాడు. "మీ దగ్గర అల్లాఉద్దీన్ దీపం లాంటివి ఏమైనా ఉన్నాయా?" అన్నాడు రామయ్య.

దుకాణం అతను నవ్వి, "ఉన్నాయి, అయితే అవి డబ్బులకు దొరకవు . నాకు నువ్వు సొంతంగా కొట్టిన కట్టెలు ఒక బండెడు తెచ్చిస్తే అప్పుడు ఇస్తాను" అన్నాడు. "నేనా? కట్టెలు కొట్టాలా ?!" అనుకుంటుండగానే రామయ్యకు మెలకువ వచ్చింది. చూస్తే వాడు ఇంకా మర్రిచెట్టు క్రిందనే కాళ్ళు చాపుకొని పడుకొని ఉన్నాడు!

కలలోనే అయితేనేమి, అసలు తనకు ఒక దీపం దొరుకుతుందన్న ఆలోచన వాడికి చాలా సంతోషాన్నిచ్చింది. వాడు అడవిలో అంతా తిరిగి, ఎండిపోయిన చెట్ల కొమ్మలూ, గట్రా ఏరుకొచ్చి, వాటినన్నిటినీ పేర్చి, ఆ మోపును నెత్తిన పెట్టుకొని పట్నం చేరుకున్నాడు.



అట్లా తిరుగుతూ తిరుగుతూ వాడు ఓ మిఠాయి దుకాణం దగ్గరకు చేరుకున్నాడు . అంగడిలో మిఠాయిలు చూసే సరికి ఇంక వాడికి అడుగు ముందుకు పడలేదు . దుకాణం అతను వీడి వాలకం చూసి , "కట్టెలు అమ్ముతావా ?" అని అడిగి, వాడి చేతిలో నాలుగు నాణాలు పెట్టటమే గాక ,

కొన్ని స్వీట్లు కూడా ఇచ్చాడు.

రామయ్య వాటిని సంతోషంగా అందుకొని , తింటూ "నేను అల్లావుద్దీన్ దీపం లాంటి దీపం కోసం వెతుకుతున్నాను . అవి ఎక్కడ దొరుకుతాయో తెలుసా, మీకు?" అని అడిగాడు దుకాణం అతన్ని.



అతను నవ్వి, "ప్రక్కనే మా అన్న దుకాణంలో ఉంటాయి, కానీ అవన్నీ వట్టి బొమ్మలు . కోరికలు తీర్చేవి ఈమధ్య అట్లా దీపాల్లాగా ఉండట్లేదు" అన్నాడు. "అయ్యో! మరి ఇప్పుడు నా కోరికలు తీరాలంటే ఎలాగ ?" అన్నాడు రామయ్య విచారంగా.

"దానిదేముంది? ఇందాక నువ్వు 'మిఠాయిలు కావాలి!' అనుకోగానే నీకు అవి దొరికినై గదా, ఇంకేమి, నీ దగ్గర ఆ దీపం ఉన్నట్లే" అన్నాడు దుకాణం అతను చిరునవ్వుతో.

"మిఠాయిలకు బదులుగా నేను తెచ్చిన కట్టెలు ఇచ్చాను గదా మీకు ?" అన్నాడు రామయ్య. దుకాణం అతను నవ్వాడు.

ఆ నవ్వుతోటే రామయ్యకు అర్థమైంది : "మన శ్రమ శక్తే మన కోరికలు తీర్చే భూతం. శ్రమించి దేన్నైనా సరే ఉత్పత్తి చేసామంటే , ఇక దానివల్ల మనం ఏమి కోరుకుంటే ఆ కోరిక నెరవేరుతుంది!"

అటు తర్వాత రామయ్య బద్ధకాన్ని వదిలేసి , స్వయంకృషితో దేన్నైనా సాధించుకునే దిశగా అడుగులు వేసాడు.

పట్నంలోనే చిన్న పని చూసుకొని , అవ్వకు కూడా సంతోషం కలిగించాడు.

# బొమ్మకు కథ రాయండి!

*ఈ బొమ్మని చూడండి. ఇందులో గబ్బిలాలూ, పెద్ద చంద్రుడూ, ముసుగు మనుషులూ, కొమ్ముల పిల్లాడూ, మంత్రాల వాడూ, భూతం లాగా ముఖం పెట్టుకున్న గుమ్మడికాయలూ.. ఏవేవో ఉన్నాయి. ఇప్పుడు మీరంతా బాగా ఆలోచించి, దీనికి సరిపోయే మంచి నవ్వుల కథ ఒకటి రాసి పంపాలి . బాగా నవ్వించిన కథల్ని కొత్తపల్లి 108 వ సంచికలో ప్రచురిస్తాం.*





# తొందరపాటు

గేయ కథ

రచన: శ్రీ బెహరా ఉమామహేశ్వరరావు గారు, పార్వతీపురం, విజయనగరం జిల్లా.



యువరాజు జయరాజు

గారాబముగా పెరిగెను

సంపదలకు కొదువలేదు

పరివారము పదుగురు.

అశ్వశాల గల దాతనికి

అందుగలదు తెలుపు గుర్రం.

వేగముగా పరుగు తీయు
గమ్యము చేరు త్వరగాను.



పెంపుడుకుక్క వారిదే
కనిపించు రాయసంగా
నడచుచుండు రాజు వెంట
ఎంత దూరమైన సాగు.

బస్తీకని వెడలె రాజు
గుర్రమెక్కి స్వారి చేస్తూ
ఒంటరిగా సాగుచుండ
వెంట వచ్చె కుక్క కూడ

కొంత దూరమట్లు సాగె
అంతలోన కుక్క వచ్చి
గుర్రానికి అడ్డు తగిలె
రాజు ఎంత అదిలించిన
మాట వినదు; దారినీదు.

రాజుగారు కోపించిరి
ప్రక్కకేల తొలగదు?
ఏల పట్టు విడువదు?!
అని తుపాకి గురి పెట్టిరి
'ఢాం..ఢాం' అని పేల్చిరి.

దెబ్బ తగిలి గాయమయ్యె,
రక్తపు మడుగే ఆయెను.
మూలుగుతూ తూలి పడుచు
కుక్క పోయె వెనుదిరిగి.

కొంత దూరమేగి రాజు

ధనపు మూట తట్టి చూచె

జీను చివర కట్టుకున్న

మూట చేతికందలేదు!

కలత చెందినాడు రాజు

తాను కూడ వెనుదిరిగీ-

మూటకోసమై వెదకుచు

కోట బాట పట్టి పోయె.

డబ్బు మూట తల మాపున

పడి యుండగ బరువుగా

తుది శ్వాసలు పీలుస్తూ

కనిపించెను తనదు కుక్క!

కన్నుల నీరాయె రాజు

తన తప్పుకు సిగ్గు పడె

ప్రథమచికిత్స చేసి దానిని

గుర్రముపై గొని పరుగిడె.

వైద్యుల కనుసన్నలలో

కుక్క తిరిగి బాగైనది

ప్రాణాపాయము తప్పగ

మరల లేచి నిలుచున్నది.



నోరులేని జీవమయ్యు

ప్రేమ యెంత పెంచుకొనెను?!

తొందరపాటుతనం

ఎంతకీడు చేసేను!



# తెలివైన చిలుక

*రచన: శ్రీ యు.విజయశేఖర రెడ్డి, హైదరాబాదు.*

*మార్పు చేర్పులు: కొత్తపల్లి.*

పల్లవ రాజ్యాన్ని పాలించే పురుషోత్తముడికి సమర్థుడు, మంచివాడు అని పేరు.

సలహాదారులపైననే ఆధారపడకుండా , తన సేనాపతిని వెంటబెట్టుకొని , మారువేషంలో రాజ్యమంతా సంచరిస్తూ, ప్రజల కష్టలను తెలుసుకొని పరిష్కరించే జయనందనుడు ప్రజల ప్రేమాభిమానాలను చూరగొన్నాడు .

పల్లవ రాజ్య సైన్యం కూడా చాలా గట్టిది.

పల్లవానికి పొరుగున ఉన్న అవంతికకు రాజు జయనందనుడు. అతనికి పురుషోత్తముడిని చూస్తే అసూయ . ఎలాగైనా ఆ రాజ్యన్ని హస్తగతం చేసుకోవాలని అతనికి కోరిక . నేరుగా యుద్ధం చేసి ప్రయోజనం లేదు - ఎందుకంటే సైన్యం పరంగా అవంతిక చాలా

చిన్నది. అందువల్ల కుట్రల మార్గాన్ని ఎంచు-కున్నాడు జయనందనుడు.

అవంతికలో ఉండే చాలా మందికి పల్లవ రాజ్యంలో బంధుత్వాలు ఉన్నాయి. జయ-నందనుడి మనుషులు ఒక క్రమంలో తమ బంధుత్వాలను గట్టి చేసుకుంటూ వచ్చారు. 'ఆ బంధువుల్లో ఎవరెవరు పురుషోత్తముడికి వ్యతిరేకంగా పని చేయగలరు?' అని పరిశీ-లిస్తూ వచ్చారు వాళ్ల మంత్రులు. వాళ్లందరికీ లక్ష్మయ్య అనే వాడొకడు నచ్చాడు.

లక్ష్మయ్య పురుషోత్తముడి అంత :పుర పరిచారకుల్లో ఒకడు. తన విధుల్లో భాగంగా అతనికి రాజుగారి గురించిన విలువైన సమాచారం చాలా తెలుస్తూ ఉంటుంది. లక్ష్మయ్య బంధువైన భూషణం అతనికి బహుమతులు ఇస్తూ మెల్లగా తన దారికి తీసుకొచ్చుకున్నాడు. ఆ పైన రాజు గారి గురించిన చిన్న చిన్న సమాచారాలకు గాను కొద్ది కొద్దిగా లంచాలు ముట్టజెబుతూ, అతనికి మరింత దగ్గరైనాడు. 'ముఖ్యమైన సమాచారాన్ని తాను ఎలాగూ ఇవ్వట్లేదు ; తను ఇచ్చే సమాచారం వల్ల రాజుగారికి ఎలాంటి నష్టమూ ఉండదు ' అన్న గుడ్డి నమ్మకంతో లక్ష్మయ్య కూడా అతనిచ్చిన డబ్బులు తీసుకుంటూ వచ్చాడు.



కొన్నాళ్ళు ఇలా గడిచాక ఒకసారి భూషణం లక్ష్మయ్యను నేరుగా అడిగేసాడు- "రాబోయే వారం రోజుల్లో మీ రాజుగారు ఎటు ఎటు వెళ్తున్నారు? ఎవరెవర్ని వెంట తీసుకెళ్తారు?" అని.

లక్ష్మయ్య అటూ ఇటూ చూసి, అతని చెవి-లో ఏదో విషయం చెప్పి , వెయ్యి వరహాలు పుచ్చుకున్నాడు.

డబ్బులు ఐతే తీసుకున్నాడు గాని , లక్ష్మ-య్యకు 'తను తప్పు చేసాడు ' అనే భావన ఎక్కువైపోయింది. ఇంకో రెండు రోజులు గడిచేసరికి అతనిక ఆగలేక, తన మిత్రుడు రాజయ్య అనేవాడిని కలిసి, తను చేసిన పని అంతా చెప్పుకొని , "ఈ వారం చివర్లో దేశ పర్యటనకు వెళ్లినప్పుడు రాజుగారి ప్రాణాలకు ముప్పు అనిపిస్తున్నది . నువ్వు ఎలాగైనా ఆయన్ని కాపాడాలి . అయితే నా పేరు మాత్రం బయటికి రాకుండా చూడు . నా ప్రాణాలు పోతాయి " అని కాళ్ళావేళ్ళా పడ్డాడు.

రాజయ్య ఒక మామూలు పశువుల కాపరి . సమస్య అర్థమయ్యేసరికి అతనికి చెమటలు పట్టాయి. "ఇదంతా నా వల్ల ఎక్కడౌతుంది" అని అతను వెనకంజ వేసాడు; కానీ ఆతను పెంచుకుంటున్న రామచిలుక "మణి" మటుకు ఇదంతా విని , "నాకు చెప్పావుగా, అంతా నేను చూసుకుంటానులే , పో ఇంక" అనేసింది.

లక్ష్మయ్య నవ్వి, దానికి ఓ నమస్కారం పెట్టి వెళ్ళిపోయాడు గాని, రాజయ్యకు మటుకు చాలా భయం వేసింది . "ఇవన్నీ రాజులకు సంబంధించిన విషయాలు- నీకేం తెలుసని, అట్లా ఊరికే మాట ఇచ్చావు ?" అని అరిచాడు అతను, మణిని.




మణి మాత్రం "నన్ను వెంటనే రాజు-గారి కోటకు తీసుకెళ్ళు . అంతా నేను చూసుకుంటాను" అంటోంది ఆపకుండా.

రాజయ్య గబగబా తన పశువులన్నిటినీ యజమాని ఇంటి వద్దకు చేర్చి , మణితో

కోటకు చేరుకున్నాడు. "రాజుగారిని అత్య–వసరంగా కలవాలి! ఒక ముఖ్యమైన సమా–చారం తెచ్చాను" అని కబురు పంపాడు. "మమ్మల్ని నేరుగా రాజుగారి దగ్గరికి తీసుకె–ళ్ళండి. వెంటనే!" అనసాగింది మణి.

రాజయ్యని, మణిని మార్చి మార్చి చూసిన ద్వారపాలకులు వాళ్ళని నేరుగా కోటలోకి తీసుకెళ్ళారు.

రాజయ్య లోపలకు ప్రవేశించి మహారాజును చూడగానే ఆయన కాళ్ళమీద వాలి, మూర్ఛపోయాడు! మరి ఇక పైకి లేవలేదు!!

మణి కంగారు పడుతూ "నువ్వు చెబుతావా, నేను చెప్పాలా?" అంటోంది. మూర్ఛ పోయిన రాజయ్యకేసి దయతో చూసి పురుషోత్తముడు, చిలుకతో "ఏమైంది, నువ్వే చెప్పు!" అన్నాడు.

"రహస్యం" అంది చిలుక.

మహారాజు సైగతో చుట్టు ప్రక్కల కాపలా వాళ్లు అక్కడనుండి వెళ్ళిపోయారు.

"ఊఁ ఇప్పుడు చెప్పు!"




చిలుక జరిగిందంతా చెప్పింది రాజుగారికి. ఆలోగా మూర్ఛనుండి తేరుకున్న రాజయ్య, బిత్తరపోతూ అటూ ఇటూ చూసాడు.

"శభాష్ రాజయ్యా! చిలుకలను సరదాగా పెంచుతారని తెలుసు, కానీ నువ్వు మాటలు కూడా నేర్పించినందుకు నిన్ను అభినంది–స్తున్నాను. మణి నాకు అంతా చెప్పిందిలే. కంగారేమీ లేదు" అంటూ రాజయ్యను మెచ్చుకొని, చిలుకను చేతిలోకి తీసుకొని ప్రేమతో దాని తల నిమిరాడు మహారాజు.

***

ఆ వారాంతంలో పురుషోత్తముడు ముందు అనుకున్న విధంగానే దేశ పర్యటనకు పోయాడు. మారు వేషంలో నగరం పొలి – మేరలు దాటి సీతాపురం ప్రవేశిస్తున్నాడు. ఆయన అక్కడ ఒక మలుపు తిరిగాడో, లేదో- ఆయనకోసమే వేచి ఉన్న భూషణం, పొరుగుదేశపు సైనికులు ఆయన్ని చుట్టు – ముట్టారు. "మర్యాదగా లొంగిపోండి! మీరెవరో మాకు తెలుసు" అన్నాడు భూష– ణం, కోరగా నవ్వుతూ.



అందుకు సిద్ధంగా ఉన్న పురుషోత్తముడు తక్షణం కత్తి ఝుళిపించి వాళ్లతో పోరాడటం మొదలు పెట్టాడు. అంతలోనే ఆయనకు మద్దతుగా పెద్ద బలగంతో వచ్చి పడిన సేనాపతి, దుండగులందరినీ చటుక్కున బంధించేసాడు!

***

భూషణాన్ని, అతనితోబాటు వచ్చిన అవంతి సైనికుల్ని బంధించి సభలో ప్రవేశ పెట్టారు. భూషణం వాంగ్మూలం మేరకు భటులు లక్ష్మయ్యను కూడా బంధించి నిలబెట్టారు . జరిగింది చెప్పుకొమ్మన్నారు లక్ష్మయ్యను..

వరహాలకు ఆశపడి రాజద్రోహం చేశానని లక్ష్మయ్య ఒప్పుకున్నాడు.

"అయితే ఈ సంగతి రాజయ్యకు ఎందుకు చెప్పావు?" అడిగింది మణి, రాజుగారి ప్రక్కనే కూర్చొని. "రాజుగారు మంచివాడు. 'ఈ దుర్మార్గులు ఆయన్ని ఏమైనా చేస్తారేమో ' అని భయం వేసింది. చివరికి ఏం చేయాలో తెలీక, నా మిత్రుడు రాజయ్యకు చెప్పుకు – న్నాను" అన్నాడు లక్ష్మయ్య.

"నేను అక్కడ ఉన్నాను కాబట్టి సరిపో –

యింది. లేకపోతే ఎంత కష్టం అగును ?" అంది మణి. ఆ మాటలకు సభలో నవ్వులు విరిసాయి.

పురుషోత్తముడు మణిని ఉద్దేశించి "వీళ్లం–దరికీ ఎలాంటి శిక్ష విధించాలో నువ్వే చెప్పు!" అన్నాడు.



"భూషణానికి మరణశిక్ష, ఈ విదేశీ సైనికు–లకు కారాగారవాసం సరిపోతాయి. లక్ష్మయ్య తప్పు చేసినా, తన తప్పుని గుర్తించి పశ్చా–త్తాప పడ్డాడు; దాన్ని సరి దిద్దుకునేందుకు తపించాడు. అందువల్ల అతనికి వేరే పెద్ద శి–క్షలేవీ వద్దు . ఉద్యోగంలోంచి తీసెయ్యండి చాలు" అన్నది మణి.

మణి చెప్పిన దానికి సభ మొత్తం చప్పట్లతో మారుమ్రోగింది.

"నీ తీర్పును వెంటనే అమలు చేస్తున్నాను " అని వెంటనే దాన్ని అమలు చేయించాడు మహారాజు. రాజయ్యను, మణిని రత్నహా–రాలతో సత్కరించాడు. సభలో మళ్ళీ ఓసారి చప్పట్లు, నవ్వులు విరిసాయి.

పురుషోత్తముడు లేచి నిలబడి చిలుకను అభినందిస్తూ, "నువ్వు చాలా తెలివైనదానివి. నిజంగానే నువ్వు అక్కడున్నావు కాబట్టి సరిపోయింది. లేకపోతే ఎంత ప్రమాదం అగును?! నీకు రాజనీతి కూడా బాగా తె – లుసు.. నువ్వు నాతోబాటు ఉండరాదూ ?" అన్నాడు.

"మా రాజయ్య ఉంటానంటే నేనూ ఉంటా!" అన్నది మణి ఉత్సాహంగా.

రాజుగారు రాజయ్యకి, మణికి ఇద్దరికీ తన అంత:పురంలో ఉద్యోగాలు ఇచ్చారు.




# నిండిన టీ కప్పు

బౌద్ధ కథ

*కథనం: నారాయణ, కొత్తపల్లి.*

'మీజింగ్' తరం నాటి పురాతన జపాన్‌లో 'నాన్-ఇన్' అనే బౌద్ధ గురువు ఒకాయన ఉండేవాడట. 'ఈ క్షణంలో జీవించటం' గురించి లోతుగా వివరిస్తుండేవాడు ఆయన.

ఆయన్ని అడిగి సందేహాలు తీర్చుకుందామని ఆయన దగ్గరికి ఎక్కడెక్కడినుండో సత్యా – న్వేషులు, జిజ్ఞాసువులు వస్తుండేవాళ్ళు . అట్లా వచ్చిన వాళ్ళందరికీ ఆయన తనదైన రీతిలో ధర్మాన్ని బోధించేవాడు. 'ఎట్లా చెబితే అవతలివాళ్ళు సత్యాన్ని స్వీకరించగల్గుతారో అట్లా' చెప్పి, వాళ్లలో బోధిని జాగృతం చేసే నేర్పు ఉండేదిట ఆయనకు.

ఒకసారి ఆయన దగ్గరికి విశ్వవిద్యాలయంలో బోధించే ఆచార్యుడు ఒకాయన వచ్చాడు . ఆయన చాలా పెద్ద మనిషి, ముఖ్యుడు, రాజుగారికి ఆంతరంగికుడున్నూ . ఆయన చుట్టూ ఉన్న వాళ్ళంతా ఆయన్ని చూసి భయపడేవాళ్ళు; ఆయన ఏం చెబితే అది కిమ్మనకుండా చేసేవాళ్ళు . 'అధికారానికి, విజ్ఞానానికీ రెండింటికీ చిరునామా తనే' అని ఆయనకు చాలా గర్వంగా ఉండేది.



ఆయన వచ్చే సరికి 'నాన్-ఇన్' అప్పుడే పొలం పని ముగించుకొని వచ్చి కూర్చొని ఉన్నాడు. "మిమ్మల్ని అడిగి మీ దగ్గర జెన్ బౌద్ధం నేర్చుకుందామని వచ్చాను. దయచేసి నాలో మీరు బోధిని జాగృతం చేయాలి " అన్నాడాయన, నాన్-ఇన్ చేతులు పట్టుకొని.

ఆయన అడిగిన తీరు చూస్తే 'జాగృతం చే-యకపోతే ఊరుకోను !" అని ఉరిమినట్లే ఉంది. నాన్-ఇన్ నవ్వి, "ఆ సంగతి మనం టీ త్రాగుతూ మాట్లాడుకుందాం రండి " అని లోపలికి తీసుకెళ్ళాడు.

నాన్-ఇన్ టీ కషాయం తయారు చేస్తుండగా ఆయన కూర్చొని మాట్లాడుతూ పోయాడు- "సమయం విలువైనది కదా , ముందుగా మీకు నేనెవరో చెబుతాను" అంటూ కొద్దిసేపు తానెవరో, తనకు ప్రభుత్వంతో ఎంత దగ్గరి తనమో చెప్పాడు. ఆ తర్వాత "నేను పుట్టి-నప్పటినుండీ జ్ఞానేచ్ఛ బాగా ఉంది . చిన్న తనంలోనే త్రిపిటకాలు మూడూ కూడా , ఆ చివర్నుండి ఈ చివరివరకూ చదివాను . తర్వాత 'ఈ ఈ ఫలానా' పండితుల దగ్గర శిష్యరికం చేసాను. వాళ్ళ దగ్గర ఇదిగో, 'ఈ

ఈ' విద్యలు నేర్చాను. ఈ విద్యలో అన్నీ బాగున్నాయి గాని, 'ఇది బాగా లేదు '- అందులో 'ఇది బాలేదు'. ఏం చేసినా ప్రాక్టికల్ గా ఉండాలి, నేను ఎప్పుడూ ప్రాక్టికల్ గా ఆలోచిస్తాను.." అంటూ పలు సంగతులు అనర్గళంగా మాట్లాడాడు.

నాన్ ఇన్ చిరునవ్వుతో ఆయన మాటలు వింటూ పోయాడు. 'టీ పాట్ 'ను, ఖాళీ కప్పును తెచ్చి ఆయన ముందు పెట్టాడు . వచ్చిన ఆచార్యుడు చెబుతూ పోతున్నాడు - "నేను అనేక రకాల బౌద్ధాలే కాదు, ప్రపం–చంలోని పలు మతాలను , సిద్ధాంతాలను కూడా చదివాను. వాటిమీద అనేక సిద్ధాంత వ్యాసాలు కూడా ప్రచురించి ఉన్నాను. నిజా–నికి నాకు అన్ని రకాల బౌద్ధాలూ తెలుసు. జెన్ బౌద్ధం కూడా తెలుసు. కన్ఫ్యూషియన్ తత్వానికి, సింహళ తత్వానికి మధ్య సామ్యం గురించి కూడా చాలా చర్చలు చేసి ఉన్నాను" అని ఇంకా చెబుతూ పోతున్నాడాయన.

"ఊ.." కొడుతూనే నాన్-ఇన్ అతని ముందున్న టీ కప్పులోకి తేనీరు పోయటం మొదలు పెట్టాడు. ఒక ప్రక్కన మాట్లాడు–తున్నాయన ముఖంకేసే చూస్తూ, మరొక ప్రక్కన కప్పులోకి టీ వొంపుతున్నాడు...



టీ కప్పు నిండింది, కానీ నాన్-ఇన్ టీ పొయ్యటం ఆపలేదు! ఈయన టీ పోస్తు–న్నాడు; అది పొరలి పోతున్నది . ఈయన నవ్వు ముఖంతో ఇంకా టీ పోస్తున్నాడు ; అది ఇంకా పొరలిపోతున్నది...

మాటల్లో పడ్డ ఆచార్యుడు తన ముందున్న కప్పును అకస్మాత్తుగా చూసి, గట్టిగా అరి–చాడు- "చాలు! చాలు! ఆపండి! మీరు పో–

స్తున్న టీ మొత్తం ఒలికిపోతున్నది ! కప్పు నిండిపోయింది గదా, దానిలో ఇంకేం పడు–తుంది?!" అని.

నాన్-ఇన్ టీ పొయ్యటం ఆపి , అతిథివైపు చూసి నవ్వాడు-

"అవును. నిండిన కప్పులో ఇంకేం పడు –తుంది? కప్పు ఖాళీ అయితే, అప్పుడు కదా, నేర్చుకునేది!" అన్నాడు.

**అమ్మ-గురువు-స్నేహితుడు-లక్ష్యం**

గుడి తలుపులు తెరిస్తే దేవుడు కనిపిస్తాడు
బడి తలుపులు తెరిస్తే గురువులు కనిపిస్తారు.
నా గుండె తలుపులు తెరిస్తే మా అమ్మ కనిపిస్తుంది.

ఆకాశం ఎత్తుకన్నా
సముద్రం లోతుకన్నా
అమ్మ ప్రేమ మిన్న

కనీళ్ళు తుడిచేవాడు స్నేహితుడు కాని
కనీళ్ళ తెప్పించేవాడు స్నేహితుడు కాదు.
కష్టాలను పంచుకునేవాడు స్నేహితుడు కాని
కష్టాలను తీర్చనివాడు స్నేహితుడు కాదు
మేలు చేసేవాడు స్నేహితుడు కాని
కీడు చేసేవాడు స్నేహితుడు కాదు.

స్నేహం అన్నిటికన్నా బెస్ట్
కలకాలం ఉంటే స్వీటెస్ట్
చెరిగిపోకుండా ఉంటే గ్రేటెస్ట్
ఇది ఇలాగే ఉండాలని నా యొక్క చిన్న రిక్వెస్ట్

పది పనులు ఉన్నా కంటికి నిద్దురమరిచిపోవద్దు
వంద పనులు ఉన్నా కడుపుకు తిండి మరిచిపోవద్దు.
వేయి పనులు ఉన్నా గురువులను మరిచిపోవద్దు.
పది వేల పనులు ఉన్నా తల్లిదండ్రులను మరిచిపోవద్దు.
లక్ష పనులు ఉన్నా లక్ష్యాన్ని మరిచిపోవద్దు.

వంద మంది స్నేహితులు ఉన్నా వంద ఆపదలు వచ్చాక
ఆదుకోవడానికి ఒక మంచి
స్నేహితుడు ఉంటే చాలు నేస్తమా!...

యుగ యుగాల చరిత మనది
తరతరాల చరిత మనది
ఒడిదుడుకులు ఎన్ని ఉన్నా ఒడిపోని
ఘనత మనది.
అందుకే కథం తొక్కి కదలవోయి భారతీయుడా
భావిత్వయం నాదే నొయ్యి ఓ నా భారతీయుడా!

రచన: కావ్యశ్రీ, 7వ తరగతి , మహేశ్వరి, 8వ తరగతి- మహాత్మా జ్యోతిబా పులే తెలంగాణ గురుకుల పాఠశాల, కీసర, తెలంగాణ.



# రైతు ప్రార్థన

*"ప్రకృతిలో అంతులేని సంక్లిష్టత ఉంది . దాని రహస్యాలను తెలుసుకోవటం మంచిదే గాని , వాటిని మార్చేందుకు ప్రయత్నిస్తే మటుకు అన్ని సార్లూ మేలే జరుగుతుందని లేదు . ప్రకృతిలోనే కాదు; జీవితంలో కూడా, మనకు ఎదురయ్యే కష్టాలు మనల్ని మరొకరకంగా గట్టి పరుస్తాయి . కష్టాల్లోంచి బయట పడ్డ కొద్దీ మనకు ఆనందాన్ని అనుభవించటం కూడా తెలుస్తుంది . కష్టాలు ఎదుర్కొనని వాళ్లకు సుఖాన్ని ఎలా ఆస్వాదించాలో కూడా తెలియదు" అంటున్నారు ఈ టీచరు గారు. మీకు ఏమనిపిస్తున్నది?*

*రచన : కె.కృష్ణవేణి, ఉపాధ్యాయిని, తేజా విద్యలయం, కోదాడ, తెలంగాణ రాష్ట్రం.*

బాగా వర్షం కురుస్తోంది.

కొందరు చిన్నపిల్లలు పడవలు చేయడంలో నిమగ్నమై పోయారు . కొందరు వర్షాన్ని చూస్తూ అందులో తడుస్తూ , కేరింతలు కొడుతూ ఉన్నారు . కానీ రైతు గుండెల్లో మాత్రం ఒకటే గుబులు - అకాల వర్షాల వల్ల పంట నాశనం అవుతుందని.

రైతు ఒక్కడే బాధపడుతూ దేవుడిని ఇలా

ప్రార్థించాడు: "దేవుడా! పంట వేద్దామంటే నీళ్ళుండవు కానీ, నీటి అవసరం లేనప్పుడు, సరిగ్గా నేను కోత కోసే సమయానికి మాత్రం పెద్ద వర్షం కురిపిస్తావు, ఎందుకు? నీ ఈ పని వల్ల మాకు పంట నష్టం ; మా శ్రమంతా వ్యర్థం. మాకు ఏ సమయంలో నీరు కావాలో, ఎప్పుడు గాలి అవసరమో మాకు తెలిసినంతగా నీకు తెలియదు స్వామీ. అందుకని దయచేసి నాకు ఈ వరం ఇయ్యి- 'పంటకు ఎప్పుడు అవసరమో చూసుకొని తగినంత గాలి, నీరు అన్నీ నేనే అందిస్తాను వాటికి!'. ఇట్లా మార్చు పద్ధతిని!" అని.



వెంటనే దేవుడు ప్రత్యక్షమై, "నువ్వు ఎట్లా అంటే అట్లాగే కానియ్యి. అంతా నువ్వు కోరుకున్నట్లే జరుగుతుందిలే, బాధపడకు!" అని చెప్పి మాయమైపోయాడు.

రైతుకు చాలా సంతోషం వేసింది. "నారు-మడి వేయాలంట- పొలాల్లో నీళ్ళు నిండాలి!" అన్నాడు. వెంటనే వర్షం వచ్చి నీళ్ళు చేరాయి. ఇక అటుపైన రైతు తన శక్తిని పూర్తిగా ఉపయోగించుకున్నాడు. పొలాల్లో నీళ్ళ మట్టం కొంచెం తగ్గిందంటే చాలు, మేఘాల్ని పిలిచి వాన కురిపించుకున్నాడు.

విత్తనం ఆరేందుకు మంచి గాలి కావాలి. రైతు గాలిని ఆదేశించాడు - వెంటనే గాలి బాగా వీచింది. కంకులు కోయటం ఆరబెట్ట-టం అయ్యింది.

ఆ వెనక వాటిని తూర్పార బట్టేందుకు ప్రయత్నించాడు రైతు. చూస్తే వరి గింజలు అన్నీ తాలువే! మొత్తం పొట్టే! గింజ లేదు!

"ఇదెక్కడి ఘోరం, స్వామీ?! నీళ్ళు అవసర-మయినప్పుడు నీళ్ళు, గాలి కావాలన్నప్పుడు గాలి- అన్నీ సమయానికి అందించాను

కదా?! కానీ పంట పండలేదేల?" అంటూ దేవుడిని తలచుకొని వగచాడు రైతు.




దేవుడు మళ్లీ ప్రత్యక్షమై "చూడు నాయనా! చాలీ చాలని నీళ్ళున్న బురదలోకి వరి మొక్కను నాటగానే, తను ఎలాగైనా నెలకొనాలని ప్రయత్నించి, గట్టిగా నిలుస్తుంది అది. అటు తర్వాత నాటు పెరిగి పెద్దయ్యే – టప్పుడు, గాలితోటి - వానతోటి పోరాడి, తన వేళ్ళను ధృడంగా మట్టిలోకి పంపించి, తన ఆవాసాన్ని స్థిరం చేసుకుంటుంది. నేను అడుగడుగునా పంపించే వర్షాన్ని, గాలిని, తట్టుకొని, అలా పెంచుకున్న తన శక్తినంతా గింజల రూపంలోకి మార్చి, కంకిని తయారు చేస్తుంది. అప్పుడు గదా, పంట నీ చేతికి వచ్చేది?!

కానీ ఎప్పుడు ఏమి అవసరమో నువ్వే నిర్ణ – యించుకొని, ఆ మొక్కలు ఏమీ శ్రమపడే అవసరం లేకుండా నువ్వే వాటికి అన్నీ తెచ్చి అందిస్తే, ఇక ఆ పంటకు దేనితోటీ పోరాటం లేదు; తనని తాను నిలుపుకునేందుకు ప్రయత్నించాల్సిన అవసరం లేదు; శక్తీ కూడా అవసరం లేదు; ఆ శక్తితో గింజలు తయారు చేసుకోవాల్సిన అవసరం కూడా లేదు. అందువల్ల వరి మొక్క పెరిగింది ; కానీ అందులో గింజలు లేవు!" వివరించాడు దేవుడు.

"ఇంత లోతుగా నేను ఆలోచించలేదు స్వామీ! నన్ను క్షమించు. మళ్ళీ అన్ని బాధ్యతలూ తీసుకొని, నువ్వే, నీకు తోచిన– ట్లు చెయ్యి" అని తలవంచి నమస్కరించాడు రైతు.



నాలుగు పేజీల కథ

# శరీరశ్రమ

రచన:శ్రీ చొప్పా వీరభద్రప్ప, విశ్రాంత ఉపాధ్యాయులు, అనంతపురం.

పరగణాలపల్లిలో నివసించే ప్రతాప్ పెద్ద సోమరి. ఏ పనీ చేసేవాడు కాదు ; ఎక్కడికీ వెళ్ళేవాడు కాదు; ఏ బాధ్యతా మోసేవాడు కాదు. ఇంట్లోనే కూర్చుని, భార్య మంగమ్మ–తో రుచికరంగా వంటలు చేయించుకొని తింటూ, కాలం గడిపేవాడు.

మంగమ్మ ఓర్పు గల ఇల్లాలు. భర్తను పల్లెత్తు మాట అనకుండా, అతను చెప్పినట్లల్లా వింటూ ఉండేది - 'ఏదో ఒకనాడు భర్తలో మార్పు రాకపోతుందా' అని ఆశగా ఎదురు చూస్తూ ఉండేది.

'కూర్చొని తింటే కొండంత ఆస్తులైనా కరిగి–

పోతాయి' అని సామెత. 'పనీ పాటా లేకుండా తింటూ పోతే వచ్చే పాట్లు తప్పుతాయా?' అని ఆమె చాలా రోజుల పాటు మథనపడింది, చివరికి ఒక రోజున కచ్చితంగా నిర్ణయించుకొని, ఉదయాన్నే లేచి పెద్ద మార్కెట్టుకు వెళ్ళింది. తన దగ్గరున్న డబ్బులకు సరిపడా కాయగూరల్ని పెద్ద మొత్తాల్లో హోల్-సేల్ ధరల్లో కొన్నది; ఆటోలో వేసుకొని వచ్చింది!

ఆ మూటల్ని ఆమె ఒక్కతే ఆటోలోంచి దింపుతుంటే, భర్త ప్రతాప్ ఊరికే చూస్తూ కూర్చున్నాడు తప్ప, కనీసం దగ్గరకు వెళ్ళి చేతి సాయం కూడా చెయ్యలేదు.

మంగమ్మ ఒక్కతే వాటిని అన్నిటినీ మోసు–కొచ్చి, ఇంటి ముందు వసరాలోకి చేర్చి, తక్షణమే అక్కడ అంగడి ప్రారంభించింది. కొద్ది రోజులు గడిచేసరికి చుట్టుప్రక్కల ఇళ్ల–వాళ్లంతా కూరగాయల కోసం ఆమె దగ్గరికే రాసాగారు; కానీ ప్రతాప్ మటుకు ఆ పని తనది కానట్లు, వసారాలో ఉన్న అరుగుమీ–దనుండి కదలకుండా గుండ్రాయిలాగా కూ–ర్చుని ఉండేవాడు. మంగమ్మ వంటపనిలో ఉన్నప్పుడు ఎవరైనా ఇరుగు పొరుగులు వచ్చి, తమకు కావలసిన కాయగూరలేంటో చెప్పినా, అతను వినీ విననట్లు ఊరుకునే–వాడు తప్ప ఆ కూరలు తూచి ఇచ్చేవాడు కాదు.

ఒక్కోసారి వాళ్ళు గొడవకు కూడా దిగే–వాళ్ళు- "ఏం మనిషివయ్యా నువ్వు? భార్య కష్టపడుతుంటే కూర్చొని తినడమేనా, నీ పని?! అంగట్లో కూర్చోవటం కూడా చేత–కాదా, నీకు? ఛీ! ఏం బతుకయ్యా?!" అని ముఖం మీదే తిట్టేవాళ్ళు. అలాంటి సంద–ర్భాలలో కూడా ప్రతాప్ లేచి పని చేసేవాడు కాదు: మంగమ్మే, తను చేస్తున్న పనిని ఆపుకొని వచ్చి, వాళ్ళకు కావలసిన కూరగా–యలు ఇచ్చి పంపేది!

అయినా, కాయగూరలు అందరికీ అవసరమే

కాబట్టి, మంగమ్మ మాట తీరు బాగుంటుంది కాబట్టి, ఆమె వ్యాపారం బాగానే సాగింది.

రాను రాను ప్రతాప్ బరువు పెరగసాగాడు . నడిస్తే కూడా ఆయాసం అవుతున్నది . మంగమ్మకు భర్త ఆరోగ్య విషయమై భయం వేసింది. దీనికోసం ఏంచేయాలో చెప్పమని తనకు పరిచయం ఉన్న ఓ డాక్టర్ గారిని సలహా అడిగింది.



ఆ డాక్టరుగారు స్థానికుడు,; ప్రతాప్ గురించి చిన్నప్పటినుండి బాగా తెల్సినవాడు - కనుక అతనితో చనువుగా "ప్రతాప్! మీ ఇంటి ముందు చాలా స్థలముంది కదా , అక్కడ ఆకు కూరలో, కాయగూరలో పండించ–కూడదూ? నీకూ బాగుంటుంది, మంగమ్మ కూరగాయల అంగడికీ కొంత ఆదాయం వస్తుంది?!" అని చెప్పి చూసాడు. కానీ ప్ర–తాప్‌కు ఆయన మాటలు చెవికి ఎక్కలేదు.

చూస్తూ చూస్తూండగానే ఒకనాడు ప్రతాప్ జబ్బు పడ్డాడు. మంగమ్మ అతన్ని ఆస్పత్రిలో చేర్చింది. డాక్టరుగారు రకరకాల పరీక్షలు చేయించి, 'శరీరంలో చెడు క్రొవ్వు చాలా పేరుకుపోయింది ప్రతాప్ ! నీ రక్తనాళాలు మూసుకుపోతున్నాయి. రక్తపోటు ఎక్కు–వైంది. నువ్వు ఇట్లాగే ఉంటే తొందరలో గుండెజబ్బుతోపాటు, చక్కర రోగం లాంటివి కూడా వచ్చే ప్రమాదం ఉంది!

దీనికి గాను నీ శరీరానికి బాగా ఎక్సర్‌సైజులు అవసరం. రోజూ ఉదయం పూట చకచకా నడవాలి, చెమట ఓడ్చే పనులు చెయ్యాలి , పట్నంలో నాకు తెలిసిన జిమ్ ఒకటి ఉన్నది .

వాళ్ళు డబ్బులు తీసుకొని , నీకు చెమటలు తెప్పిస్తారు' అన్నాడు.




'శరీరంలో కొవ్వు పేరుకోవటం; పట్నం, జిమ్, ఎక్సర్‌సైజు, డబ్బులు' అనగానే ప్రతాపుకు తెలివి మేలుకున్నది.

"నేను ఇక్కడే బాగా శ్రమ పడతాను డాక్టరు గారు, మూటలు మోస్తాను , చెమటలు వచ్చేట్లు నేలను దున్నటం, కలుపు తి-య్యటం, నీళ్ళు కట్టటం చేస్తాను . పట్నం వెళ్లకుండా సరిపోదా?" అన్నాడు.

"ఇక్కడ ఉంటే నువ్వు పని చేయవు ప్రకాశ్ ; చూస్తున్నాను కదా. ఇంట్లో ఉన్న చోటినుండి లేవవు నువ్వు. జిమ్ వాళ్లకైతే నీలాంటి వాళ్ల-చేత ఎట్లా ఎక్సర్ సైజులు చేయించాలో బాగా తెలుసు. నువ్వు వాళ్ల దగ్గరికి వెళ్తేనే నయం " అన్నారు డాక్టరు గారు.

"ఈసారి ఆ మాటలు ప్రతాప్ మనసులో బాగా ప్రభావం చూపాయి . ఇంటికి వెళ్లగానే అతను పూనుకొని, పెరడునంతా బాగా గుల్ల చేసి, చదును చేసి, పాదులు కట్టి, తడి పెట్టాడు. సాయంత్రం కాగానే విత్తనాల అంగడికి పోయి. అక్కడ ఆకుకూరల, కాయకూరల విత్తనాలు తెచ్చి నాటాడు..

ఆ రోజు అతను చాలా అలసిపోయాడు . శారీరక శ్రమ చేయటం వల్ల అతనికి ఇప్పుడు బాగా చెమట పట్టింది. రాత్రంతా కదలకుండా పడుకున్నాడు. మామూలుగా రాత్రిళ్ళు అసలు నిద్ర అన్నది ఎరుగక అలమటించే ప్ర-తాప్, ఆ రోజున ఒళ్ళు మరచి నిద్రించాడు .

నిద్ర సుఖం ఎంత తియ్యనిదో అతనికి ప్రత్యక్షంగా తెలిసి వచ్చింది.

ఇక అలా అతను ప్రతిరోజూ అతను ఉత్సాహంగా పనిచేయసాగాడు . చూస్తుండగానే వారాలు గడిచిపోయాయి . ఆకుకూరలు కోతకు వచ్చాయి . బీర, వంగ, మిరప, టమేటా వంటి కాయగూరల చెట్లన్నీ ఏపుగా పెరిగినై. కాత మొదలైంది. రోజులు గడిచే కొద్దీ వారికి వచ్చే ఆదాయం కూడా బాగా పెరిగింది. అంతకుముందు మజ్జుగా, సోమరిగా ఎక్కడబడితే అక్కడ కూలబడే ప్రతాప్ ఇప్పుడు తన పనిని తాను కల్పించుకుంటున్నాడు. ఉత్సాహంగా కూడా ఉన్నాడు . మూడు నెలల తర్వాత మంగమ్మ అతను కలిసి డాక్టరు గారి దగ్గరికి వెళ్ళారు మళ్ళీ . ఈసారి పరీక్షల్లో అతను పూర్తి ఆరోగ్యంగా ఉన్నట్లు తేలింది!

"శ్రమ చేసే శరీరం చూసావా, ఇలా చలాకీగా ఉంటుంది" అని డాక్టరుగారు అంటే మంగమ్మ, ప్రతాప్ ఒకరినొకరు చూసుకొని నవ్వుకున్నారు.

**స్వాగతం!**

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో సగానికి పైగా కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లల-కోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు కూడా చాలామంది పిల్లలే.

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్నీ, బొమ్మల్నీ సరిదిద్ది, మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేసి, పిల్లలచేత చదివించటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలు పంచుకోండి. చేతనైన సాయం చేయండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం!

# పదరంగం-106

*నిర్వహణ: కొత్తపల్లి.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | 4 | ★ |
| 5 | | | ★ | 6 | |
| | ★ | 7 | | | ★ |
| 8 | 9 | | ★ | 10 | |
| ★ | 11 | | 12 | | ★ |
| 13 | ★ | ★ | 14 | | |

**నిలువు:**

1. 'ఇదే', మహా భాగ్యం (4)

2.ఐశ్వర్యంలో మొదటిరెండూ తిరగబడ్డాయి. (2)

3.గడిబిడిగా 'పాదాలజంట' (5)

4. వీటిలో ముత్యాలు తయారౌతాయి. (6)

9. 'పెరుమాళ్ వెంకటేశ' లో 1,5 (2)

12. శ్రీనివాసుడి తల్లి తిరగబడితే 'కు ' వెళ్లి పోయింది. (2)

**అడ్డం:**

1. దసరా బతుకమ్మ పండుగ వచ్చే తెలుగు నెల (5)

5. తెలుగు ' యూరప్' గజిబిజి (3)

6. 'ము' లోపించిన 'నిజం' తిరగ బడింది. (2)

7. 'ముంపు ' లాగా వచ్చే పాత మాట – గతం అనిఅర్థం. (3)

8. నాటకాలో రాజుగారు 'మేపుతాను' అని ఇలా అంటారు.(3)

10. 'ఇది చేతికి వచ్చింది ' అంటే బాగా నష్టం వచ్చినట్లు. (2)

11. అమాయకత్వంతో నవ్వించే అచ్చ తెలుగు వాడు. (4)

13. 'సంబోధన ప్రథమ' లో మొదటిది. (1)

14. ఎటు చదివినా అదే 'వస్త్రము ' అని అర్థం. (3)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 108 ని బహుమతిగా పంపిస్తాం!

## KGBV Jharasangam పిల్లల రచనలు సేకరణలు
















# పదాల్ని వెతికి పట్టుకోండి!

***ముసలివాళ్ళు, జీవితం, కొడుకు, సంతోషం, నంబరు, అహంకారం, మమకారం, శాంతి, ప్రేమ, గుణం, విత్తనం, విలాసాలు, కుక్క, రామాయణం, విజయం, నెమలి, రాముడు, లక్ష్మిదేవి, నక్కపాట, ఢిల్లీ,***

*ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి -నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి - ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!*

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రా | ము | డు | అ | గా | కు | ణం | నం | దే | నా | లి | పా |
| మా | ల | నా | తో | తి | ల | బ | ము | క్క | గు | న | య |
| య | జీ | కొ | హం | మ | రు | వా | కు | లు | సా | లా | వి |
| ణం | జ | వి | అ | దే | కు | గు | రా | మ | డు | యం | ప్రే |
| తో | వి | నె | తం | కా | మ | జ | ళ్ళు | వా | లి | స | ము |
| షం | నె | అ | ట | పా | క్క | న | గా | న | సం | జ | తి |
| లి | ల | తో | మ | మ | కా | రం | వి | మ | క్ష్మి | ళ్ళు | శాం |
| మ | ళ్ళు | నం | ల | గు | త్త | పా | కా | తి | బ | తో | జ |
| నె | రా | కొ | డు | కు | ము | గా | కు | హం | వి | జ | గా |
| ల | సం | గు | యం | మ | య | డు | ట | పా | అ | క్క | షం |
| రు | మ | క్క | జ | ప్రే | జ | ల | క్ష్మి | దే | వి | నె | తో |
| న్ని | నం | త్త | వి | మ | కా | ట | గు | ణం | పా | స | సం |

**కొత్తపల్లి** ప్రింటు పుస్తకాలను ఆన్‌లైన్లో ఆర్డరు చేయటం, చందాలు కట్టటం చాలా సులువు! క్రెడిట్ కార్డుల ద్వారాను, డెబిట్ కార్డుల ద్వారాను, నెట్ బ్యాంకింగ్ ద్వారా కూడా కొత్తపల్లికి డబ్బులు చెల్లించవచ్చు! అక్కౌంటు నెంబర్లు వెతుక్కునే పని కూడా లేదు! సందర్శించండి: **http://www.instamojo.com/kottapalli**



**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**

కథల పుస్తకాలండీ కథల పుస్తకాలు! పిల్లలు చెప్పిన కథలున్నాయ్! పెద్దలు వ్రాసిన కథలున్నాయ్!

రంగురంగుల బొమ్మలున్నాయ్! అక్కడక్కడా జోకులున్నాయ్!

ఆన్‌లైన్‌లో దొరుకుతున్నాయ్! ఇప్పుడే కొనండి! అందరికీ చెప్పండి!!!




**రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:**

**రూ. 360/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

నెఫ్ట్ ట్రాన్స్ఫర్ మరియు ఫోన్ పే వంటి ఇన్‌స్టెంట్ ట్రాన్స్ఫర్ల కోసం:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of India
Dharmavaram Branch
IFSC: SBIN0020902

(బ్యాంకు వారి నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ మేము రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తుంది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్స్ఫర్ చేయగలరని ప్రార్థన)

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు :

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2013 Set | 3 | 76 | 75 |
| 2 | 2014 Set | 10 | 289 | 250 |
| 3 | 2015 Set | 7 | 746 | 175 |
| 4 | 2016 Set | 8 | 877 | 200 |
| 5 | 2017 Set | 7 | 1100 | 175 |
| 6 | 2018 Set | 7 | 1230 | 210 |
| 7 | 2019 Set | 4 | 1500 | 120 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా. పిన్: 515101. ఫోను: 7702877670, 9490180695. ఇ-మెయిలు : team@kottapalli.in

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 23/10/2019 Postal Regn No: HDP/008/2018-2020

# కథల కథ

అనగా అనగా ఒక చిన్న కథ తయారైంది. గెంతుకుంటూ, ఆడుకుంటూ పోతోంది ఆకాశంలో. అంతలో దానికొక రామచిలుక ఎదురైంది. "చిట్టి కథా, చిట్టి కథా! నువ్వు భలే కనిపిస్తున్నావు. నేను నిన్ను తీసుకుంటాను, ప్లీజ్!" అన్నదది.

"తీసుకో, తీసుకో! దాందేముంది? నేనున్నదే అందరికోసం!" అన్నది చిన్న కథ.

రామచిలుక చిట్టి కథను తీసుకోగానే కథలు రెండైనై! చిలకేమో ఒక కథను పట్టుకొని ఎగురుకుంటూ పోయింది- బిగ్గరగా అరుచుకుంటూ.

ఇంకోకథ తన దారిన తను పోతూ ఉంటే చిన్నారి పాప ఒకతె ఎదురైంది దానికి, ఓ చెట్టుకొమ్మను పట్టుకొని.

"ఏం, చిన్నారీ! ఎటు పోతున్నావు, ఒక్కతెవే? మీ అమ్మేది?" అంది కథ.

"అమ్మ పోయి కొమ్మ వచ్చె ఢాం ఢాం ఢాం!" అని నవ్వింది పాప. కథకి పాపను చూస్తే ముచ్చట వేసింది.

అది పాపతో కలిసి పోయి, వాళ్ళ అమ్మనీ, అమ్మమ్మనీ, నాన్ననీ అందర్నీ చుట్టుకొని వచ్చింది.

రామచిలుక అక్కడ అరచుకొంటూ పోతుంటే మొద్దురాముడు ఎదురయ్యాడు దానికి: "ఏయ్! చిలకా! భలే కథ ఉన్నట్లుందే, నీ దగ్గర? నాకూ చెప్పు! వింటాను!" అన్నాడు వాడు.

"ఊరికే వింటే ఏం లాభం? రాయాలి! నీకు చేతులున్నై కద!" అంది చిలుక.

"ఊహ్! ఓహ్! అయ్యో! రాయటం రాదే!" మూలిగాడు వాడు.

"కుదరదు నాన్నా! నన్ను అందుకుంటే రాయాల్సిందే!" అన్నది కథ. "సరే" అని వాడు రాయటం నేర్చుకున్నాడు.

ఈ సారి ఒక్క కథే పది కథలైంది- ఎవరెవరినో చేరింది. అందరికీ చదవటం నేర్పింది.

ఆ కథని చదివిన పిల్లలెవ్వరూ దాన్ని ఆపుకోలేదు- అందరి దగ్గరా అది రెండింతలు అవుతూనే పోయింది. ఆ పిల్లల స్నేహితులు- వాళ్ళ అమ్మా నాన్నలు- వాళ్ళ స్నేహితులు- ఇట్లా పోతూనే ఉంది కథ- అందరూ విన్నారు; అందరూ చదివారు; అందరూ చెప్పారు!

చాలా ఏళ్ళ తర్వాత మాకు చెప్పిందొక పాప, ఆ కథని- "ఓయ్, కథా! రా!నిన్ను కొత్తపల్లిలో వేస్తాం" అన్నాం మేం.

"మా బాగా వేసుకోండి! నేనున్నదే అందరికోసం!" అన్నది కథ.

"సరేగానీ, నిన్నెవరు తయారు చేశారు, మొదట?" అడిగాం, మేం, పెద్దవాళ్ళం.

"అయ్యో! నేను ఎన్ని చోట్ల తిరిగాను, ఎంత మారాను! ఎప్పుడో ఒక రామచిలుక పాడింది నన్ను! ఒక మొద్దు రాముడు రాశాడు నన్ను! కానీ ఎందరు పిల్లలు బ్రతికించారో, ఏం చెప్పను? ఎంతమంది పెద్దలు మెచ్చి కాపాడారో, ఏమనను? మీరేమైనా మొదటివాళ్ళా? మీపని మీరు కానివ్వండి! నా దారిన నేను ఎగురుతూనే ఉంటాను" అని నవ్వింది కథ.

ఇదీ, ఈ కథల కథ!

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.